# సేవిక

[పెద్దకథ]

రచయిత :

ధనికొండ హనుమంతరావు

ప్రచురణ :

జ్యోతి కార్యాలయం,

మద్రాసు-17.

# సేవిక

మధ్యాహ్నం మొదలైన వాన సాయంత్రం ఐదు గంటలకు ఆగింది. మబ్బుల చాటున దాక్కున్న సూర్యుడు తిరిగి తీక్షణంగా ప్రకాశించ సాగాడు. భూమి చల్లబడి నందువల్ల సూర్యుని వేడి బాధావహంగా లేదు...మనసుకు ఎంతో ఆహ్లాదంగా వుంది.

ఇంతసేపు ఈ యింట్లో కూర్చొని వర్ష ధారలను చూస్తూ కూర్చున్న సూర్యం, బంగళా బైటికి వొచ్చి నిలబడ్డాడు. తోటలోని మొక్కలన్నీ స్నానం చేసి హాయిగా వీచే పిల్లగాలులకు తల లూపుతున్నయ్. చెట్ల మీద మిగిలిపోయిన నీటి చుక్కల్లో సూర్య కిరణాలు ధగధగా ప్రకాస్తున్నయ్. ఉండి ఉండి సన్నని తుప్పరగా చెట్లమీది నీటి బిందువులు నేలకు రాలుతున్నవి.

ఈ వాతావరణంలో తోటంతా పరుగెత్తా లనిపించింది సూర్యానికి; మొక్కలతో ఆడుకోవా లనిపించింది...కాని, తన వయస్సు! నలభై వర్ష ఋతువుల్ని చూసిన తను చిన్న పిల్లాడిలాగు, అల్లరి చిల్లరగా ఆడుకోవటం ఏమిటి! ఎవరైనా చూస్తే నవ్వక తప్పదు!...కాని తనకీ వింత వూహ ఎందుకు కలగాలి? ఊహలకు ఒక దారీ తెన్నూ వుండక్కర్లేదు కాబోలు!

వంటవాడు అందించిన వెచ్చని కాఫీ తాగి సిగరెట్ వెలిగించాడు. ప్రాణానికి ఎంతో హాయిగా వుంది. ఎక్కువసేపు వరండాలో నిలబడలేక, తోటలో పచార్లు చేయసాగాడు. పిల్లవాడివలె పరుగెత్తాలనీ, చెట్లు యెక్కాలనే తీవ్రవాంఛను బలవంతాన ఎలాగో తొక్కి పట్టుకో గలిగాడు...కాని అందుకు బదులుగా నడుస్తూ పచ్చని గడ్డిని కాలితో తంతూ, ఆ తన్నుకు చిందిపడే చినుకుల్ని చూసి ఆనందిస్తున్నాడు. ఎత్తుగా పెరిగిన గడ్డి, రక్షణలేని పాదాలకు మెత్తని చల్లని తివాసివలె తగులుతూ చక్కిలిగింతలు పెడుతోంది. మొక్కల్ని చేతో తాకగానే ఆకులమీది నీటి బిందువులు కిందికి రాలుతున్నయ్...సిగరెట్ పొగల్ని నాజూకుగా వొదుల్తూ సూర్యం తోటంతా తిరిగాడు...

బవర్‌లోకి వెళ్ళి కూర్చున్నాడు. బవర్ మీదికి పాకిన తీగెలు, ఉండి ఉండి రాల్చే నీటి బిందువులు చేసే మెత్తని శబ్దం, చెవులకు ఎంతో యింపుగా వుంది. ఇది నందన వనమంటే ఇంతకు మించి ఊహించుకోనవసరం లేదనిపించింది. మనసు ఎంతో తేలికై ఆకాశ వీధుల్లోకి ఎగిరిపోతూన్నట్లనిపించింది...

కేవలం ఆనందించవలసిన యీ వాతావరణంలో, అకాతుగా పెద్ద విషాద మేఘం సూర్యాన్ని ఆవరించింది! అతను తీవ్రంగా కూర్చొని ఆలోచనలోకి దిగాడు. ఆలోచనలు ఆరు సంవత్సరాల వెనుక మొదలిడినయ్...

సరిగ్గా ఆరేళ్ళ క్రితం తన భార్య చనిపోయింది. సౌఖ్యమయ జీవితానికి అడ్డంకి ఏర్పడింది; కాని ఎంతో తెలిసిన తను, ఆ దుఃఖాన్ని భరించాడు; తనకోసం కాకున్నా తన పన్నెండేళ్ళ పద్మ కోసమై! ఆ తరువాత ఎన్నడూ తన భార్యను తలిచి, పద్మ దుఃఖాన్ని రేకెత్తించ లేదు. ఆమె చిన్న హృదయంలో తల్లిని గూర్చిన దుఃఖాగ్నిని చాలావరకు చల్లార్చగలిగాడు. తానే తల్లివలె, తండ్రివలె కూడా ప్రవర్తించాడు. ఆమె మనసును అనేక ఇతర విషయాల మీదకు మళ్ళించేందుకు విశ్వప్రయత్నాలు చేశాడు. ఈ విధంగా తనుకూడా చాలావరకు బైట పడ్డాడు. ఒకే బాధకు గురైన ఇద్దరు వ్యక్తులు ఒకరికొకరు సానుభూతి చూపుకుంటూ, ఒకరికొకరు చేదోడు వాదోడుగా ఉంటూ సమస్యను ఛేదించటం జరిగింది; యీ ప్రయత్నాల్లో తను విజయాన్ని పొందాడు.

పద్మ తనకు బ్రహ్మాండమైన చావు బతుకుల సమస్యగా పరిణమిస్తుందనుకున్నాడు! కాని తీరా లౌకిక ప్రపంచం ఆ సమస్యను క్రమంగా తీర్చగలిగింది. ఈ నాడు తను భార్యను గూర్చికానీ, పద్మ తల్లినిగూర్చికాని, విచారించ వలసినది లేదు...ఆమె క్రమంగా స్మృతి పథంనుంచి జారిపోయింది! ఆమె తోడు లేకుండానే జీవించగల ఘటాన్ని వారిద్దరూ నేర్చుకో గలిగారు...

ఆ నాటికీ యీనాడు తనకు భార్య జ్ఞాపకానికి వొచ్చింది. తను వ్యాపారంలో పూర్తిగా నిమగ్నుడవటంవల్ల, ఆమెనుగూర్చి ఆలోచించే తీరికే లేకపోయింది. పద్మ తన చదువుతో, స్నేహితురాళ్ళతో ఆ విషాద సంఘటననే మరిచి పోయింది...

తన భార్య ఇవాళ ఎందుకు గుర్తొచ్చింది? తను తీరిగ్గా వున్నాడు కనుకనా? కాదు—యీమాత్రం తీరిక వున్న యితర రోజుల్లో ఆమె గుర్తు రాలేదు...పోతే యీ వాతావరణం వల్లనా? అంతే కావొచ్చు. ఇప్పుడు తన భార్య తన పక్కన కూర్చుంటే, ఈ ప్రకృతి సౌందర్యాన్ని ఎంతో ఆనందించేవాడు! మరిచిపోదామన్నా మరువలేని ఆ సౌఖ్యం తన మనసును ఉరకలు వేయిస్తోంది!

ఐతే తన భార్య యివ్వగల ఆ సౌఖ్యాన్ని యితర స్త్రీ - తనకు నచ్చినామెయే కావొచ్చు - యివ్వగలదు! ఆ సంగతి తనకు తెలియక కాదు—మళ్ళీ పెళ్ళాడనిది! తన వయస్సు ముదిరిందనీ కాదు! పద్మ కోసమై తాను యీ పెళ్ళి ప్రస్తావననే తల పెట్టలేదు.

పద్మ పెళ్ళీడుకు వొచ్చింది—యీ సంవత్సరంలోనే పెళ్ళి చేసేసి ఆమెను అత్తవారింటికి పంపేస్తాడు. ఆ తరువాత బిక్కుబిక్కు మంటూ తను, యీ లంకంత బంగళాలో జీవిత శేషాన్ని గడపాలి కాబోలు !

ఎన్నడూ ఎరగని ఒంటరి తనంలోని భయం సూర్యాన్ని ఆవరించింది. తను వివాహమాడి ఉన్నట్లయితేనే ఎంతో బాగుండేది !... కాని యీ భావన తనలో మెరిసింది [illegible] ఆలస్యంగా ! ఐన దానికి చేసేది లేదు...కాని ఇప్పుడు మాత్రం మించి పోయిందేముంది? తను వివాహమాడ దల్చుకుంటే ఎంతో మంది తమ కూతుళ్ళను ఇచ్చేందుకు సిద్దంగా వుంటారు. తనకు తానే యజమాని కనుక, ఒకరి సలహాలు తనకు అనవసరం!

కాని, తన ప్రస్తుత వయస్సు! యీ వయస్సులో తను పెళ్ళాడ గలిగినప్పటికీ ఏ కన్న తండ్రి మనః పూర్వకంగా తనను అల్లుణ్ణిగా స్వీకరిస్తాడు? ఏ కన్య తన హృదయ పూర్వకంగా కోరి పెళ్లాడు తుంది? తనా పెద్ద రూపసి కాడు...వయస్సా ముదిరి పోయింది...తనకు వివాహ ప్రాప్తే లేదేమో?

యీ తలపు అతనికి చాలా బాధాకర మనిపించింది. తనను తాను నీచ పరుచుకుంటున్నట్లనిపించింది. తనకన్న వయసు ముదిరిన వాళ్లు, హీనులు, నీచులు పూటకూటికి గతిలేని వాళ్లు కూడా పెళ్ళిళ్లు చేసుకోవటం తనకు తెలుసు. వాళ్ళతో సరిపోలిస్తే తనకు అర్హత లేదనుకోవటం వొట్టి పొరపాటు !

తన ఐశ్వర్యానికి ఆశపడే తనకు పిల్ల నిస్తారు. కాని ఐశ్వర్యం ఒక సుగుణం కింద పరిగణించటం లేదు. మిగతా సుగుణాలన్నీ సుగుణాలూను - ఇదొక్కటే కాని దీనా? ...అందముండి, యవ్వనముండి, చదువు సంధ్యలున్న యువకుడే బీదవాడైతే—భార్యను ఎలా పోషించుకో గలుగుతాడు? జీవితంలోని సమస్యలలో అధిక భాగాన్ని డబ్బు తీర్చ గలదు—అలాటప్పుడు ఆ ధనానికి తగిన స్థానాన్ని ఇవ్వకుండా, దాన్ని లెక్క చేయకుండానే బతకగలగటం ఎవడితరం? డబ్బు మినహాగా మిగతా సద్గుణాలు ఉన్నప్పటికీ, సుఖపడేదేమిటి?

కనుక డబ్బు విలువను గ్రహించిన తనకూ, ఆ విలువలు తెలిసిన లోకానికీ ఒక విధమైన సంబంధ బాంధవ్యం ఉండనే వుంది! అదే తన 'అర్హత' అనేందుకు సందేహం లేదు. లోకమంతటా గుర్తించబడే అర్హత అది!

కాని యీ అర్హతతో వివాహమాడినట్లయితే, దాంపత్య జీవితం ఎలా వుంటుందో తెలుసుకోలేనంత మూర్ఖుడు కాడు తను! మహా బతుకుతే మరో పదేళ్లు—లేదా పుష్కరం; ఆ తరువాత విధవయ్యే తన భార్య సంగతేమిటి? తన సుఖాన్ని ఆలోచించుకున్నాడే కాని, ఇతరుల సుఖాన్ని తను ఆలోచించ లేదు...!

ఐతే ఏదో విధంగా తనూ సుఖపడ వలసిన అవసరం వుంది... లేకపోతే బతకటంలో అర్థం లేదు! అనుభవించలేని ఐశ్వర్యం దేనికి? నిజానికి ఎంతో కష్టపడి ఏరోజు కారోజు సంపాయించుకునే వాళ్లు కూడా. సుఖపడేందుకు ప్రయత్నించి సఫలులవుతూనే వున్నారు...తన సౌఖ్యానికి అడ్డుపడే గ్రహాలను తొలిగించుకోవటం కర్తవ్యం కాక మరేమిటి? ఇతరులెవరైనా కష్టపడ వలసి వొచ్చినా తను లెక్క చేయ నక్కర్లేదు...ఎందుకంటే ఆ కష్టపడే వాళ్లు కూడా, వేరొక రూపంలో సౌఖ్యాన్ని ఆశించిన వారే! స్వార్థంలేని బతుకులో సారం ఏముంటుంది కనుక! ఏతావాతా, తను ఆరేళ్లుగా పొందని సౌఖ్యం కోసమై విచారించటం కన్నా, వెను వెంటనే దానికోసం ప్రయత్నించి, దాన్ని అందుకోవాలనే నిశ్చయానికి వొచ్చాడు.

నిశ్చయం వెనకనే తను ఎన్నుకోదగ్గ స్త్రీ కూడా అతని మనస్సులో మెరిసింది. ఆమె ఎవరో కాదు — పద్మ స్నేహితురాలు, సత్య

•వతి. సత్యవతి పద్మకన్న నాలుగేళ్లు పెద్దది. ఆర్థిక బాధవల్ల సత్యవతి స్కూల్ ఫైనల్ పాసుకాగానే చదువుకు స్వస్తి చెప్పింది.

స్కూలుకు వెళ్ళటం మానినా, పద్మకోసం ప్రతి సాయంత్రమూ ఇంటికి వస్తూనే వుంటుంది. ఇద్దరూ కలిసి చీకటి పడేవరకూ తోటలో షికారు చేయటమో, కారెమ్స్ ఆడుకోవటమో, లోకాభి రామాయణాన్ని పారాయణ చేయటమో చేస్తూంటారు. స్కూలు మానేసినా, కట్నం ఇవ్వలేని అశక్తులు కావటంవల్ల, సత్యవతి తల్లి దండ్రులు ఆమెను ఒక అయ్యచేతిలో పెటలేక పోయారు.

యీ సత్యవతి మీద తన మనస్సు ఇంతగా కేంద్రీకరించ బడుతుందని సూర్యం ఎన్నడూ అనుకో లేదు. తన కుమార్తె యీడు దాని మీదికి బుద్ధి మళ్ళటం ఏమిటి? వయస్సునే ప్రధానంగా గణించుకోవటం వల్ల, ఇదేదో నేరమనే భావన తనకు కలగబట్టి. తనకు తానే సంగా ళించుకోవాల్సి వొచ్చింది. కానీ వయస్సొక్కటే ప్రధానం కాదుకదా!

ఇన్నాళ్ళూ తను కూడనిపని అనుకుంటూనే సత్యవతి మీది మమ కారాన్ని మొదలంటా నరికేసు కుంటూ వొచ్చాడు. కాని ఆ మమకారం రూపు మాసిపోయిందనుకోవటం వొట్టి భ్రమేనని యీనాడు తేలి పోయింది. ఒక సమయంలో చేయరాని పనిగా తోచినదే. వేరొక సమయాలో చేయ వలసిన పనిగా తోచటంలో వింతేమీ లేదు.

చేయదగటం, చేయదగక పోవటం మాత్రమే కాదు... చెసి తీర వలసిన పరిస్థితి, తాను ఆశించిన సౌఖ్యాన్ని పొందేందుకు వేరొక మార్గం లేకుండటం—ఒక కొత్త అవసరాన్ని సృష్టించింది. ఇన్నాళ్ళూ తను వెధవ అనుమానంతో సత్యవతిని కోరలేదు; నిజంగానే తాను గొప్ప అవ కాశాన్ని జారవిడిచాడు! అది కేవలం తన లోపమే! తన యీ లోపాన్ని నిందించు కుంటూ, మరి కొంత కాలయాపన చేయటం జరగకుండానే, ఇప్పటికైనా జాగ్రత్త పడ్డాడు తను!

ధ్యాన మాత్రాన సత్యవతి తన కళ్ళెదుట నిలబడ్డట్టయింది. ఆమె రూపసి—కాని బీదది. ఆమె రూపం గుర్తించ బడేందుకు ఆమెకు తగి నన్ని ఆభరణాలు లేవు; కనీసం కట్టుకునేందుకు మంచి చీరెలన్నా లేవు. ఆ మాటకొస్తే సరైన పోషణ కూడా లేకనే ఆమె చిక్కిపోతూ వుంది! అలాంటి సత్యవతిని తను పెళ్లాడటమంటే — ఇందులో తన స్వార్థమే

కాదు; ఆమెకు సమాజంలో ఒక మంచి స్థానంగూడా ఏర్పడుతుంది; ఆమె ఎంతో సుఖపడ గలదు! తన తరువాతి తరం వాళ్ళను తన సంతానానికి కూడా గొప్ప న్యాయాన్ని చేసిన దవుతుంది. ఆమె సమస్యతోపాటు ఆమె తల్లి దండ్రుల సమస్య కూడా పటాపంచ లవుతుంది!

ఈ సత్యవతి మీదనే తన మనసు లగ్నం కావటంలో ఆశ్చర్యం ఏమీ లేదు. ఇది క్షణాల్లో జరిగింది మాత్రం కాదు. సంవత్సరాల పర్యంతం తన మనసులో మెదులుతూనే వుంది. కాని తాను దాన్ని లెక్క చెయ్య లేదు — కాదు — తాను లెక్క చేయనట్లుగా నటించసాగాడు. అందుకు కారణమల్లా — తనకు చేదోడు వాదోడుగా వుండే గృహిణి అవసరమనే సత్యాన్ని గుర్తించ నందువల్లనే ఈ సత్యవతిని గూర్చి పట్టించుకో లేదు. ఐతే తాను లెక్క చేయనట్లే నటించటం వల్ల, ఆ వాంఛ తీవ్రతరమై, తీవ్రతమ రూపాన్ని దాల్చింది. ఈ తీవ్ర మైన వాంఛను నిగ్రహించ గల సామర్థ్యం, మరి తనలో లేదనే విషయాన్ని కూడా అర్థం చేసుకో గలిగాడు.

ఇంకా వెనక్కి వెళ్ళి ఆలోచిస్తే, సత్యవతిని చూడాలనే తహతహ మొదటినుంచీ తనలో పనిచేస్తూనే వుంది. మొదట్లో ఆమె సిగ్గుపడుతూనే తనను తప్పించుకొని తిరిగేందుకు ప్రయత్నాలు చేసినా, క్రమంగా తన ఎదుట పడేందుకు అలవాటై పోయింది. ఆ మాటకొస్తే తన కుటుంబం లోని వ్యక్తివలెనే ఆమె ప్రవర్తించ గలుగుతూంది. తనూ పద్మా, సత్యవతీ ఎన్నో సినిమాలకు వెళ్ళారు. తనంటే ఆమెకు ఎంతో గౌరవం... ఇన్నాళ్ళూ సత్యవతిని గూర్చి సీరియస్‌గా తను ఆలోచించ లేదు; ఈనాడు తీవ్రంగా ఆలోచిస్తూండడం ఒక్కటే భేదం, ఈ తీవ్రాలోచనలో తాను ఇన్నాళ్లు గ్రహించలేని అనేక సత్యాలు కళ్ళముందు ప్రత్యక్షమవుతున్నాయ్.

సత్యవతి మొహంమీద ఎప్పుడూ కనిపించే విషాద మేఘాన్ని తాను మొదటి నుంచీ గమనిస్తూనే వున్నాడు. ఆమె వయస్సులో ఉండవలసిన చలాకీ తనమే ఆమెలో ఎన్నడూ కనిపించ లేదు; చావలేక బతుకు తున్నట్లు తనకు తోచేది. సత్యవతి లాంటి స్త్రీ దాదాపు తన స్వప్న సుందరే ననే మాటను చాలా సార్లు తను అనుకున్నాడు. ఆ సంగతి ఆమెకు చెప్పాలని కూడా తలిచాడు. కాని అవకాశం దొరక లేదు;

అదీగాక ఒక వ్యక్తినిగూర్చి అనుకున్న వన్నీ, చెప్పటం వరకూ రావాలని ఏముంది? ఆమె స్థితికి మొదటినుంచీ తాను సానుభూతి చూపుతూనే వున్నాడు. నిజానికి సత్యవతికి ఏదో విధంగా సహాయం చేయాలని అనేకసార్లు అనుకున్నాడు; కాని చెప్పుకో దగ్గ సహాయం చేసే అవకాశం తనకు చిక్కలేదు.

ఉదాహరణకు—పద్మకు చీరెలు కొనేప్పుడు సత్యవతిని కూడా వెంట తీసుకొని వెళ్ళాడు; ఆమె ఏరిన చీరెల్నే కొన్నాడు—ఆమెను కూడా తీసుకోమని బలవంతం చేశాడు; కాని ఆమె నిరాకరించింది. చేసేది లేక తనూ వూరుకున్నాడు. సత్యవతి ధన హీనురాలే కావొచ్చు. కాని అభిమానవతి! తనెవరు—ఆమె ఎవరు? కనుకనే తను చూపదలచుకొన్న సానుభూతి చూపలేదు. అందువల్ల తనకు ఆమెపట్ల గౌరవం పెంపొందింది. ఆమె సుగుణ పరంపర మరో మెట్టు పైకి పాకింది.

...కాని ఇప్పటి పరిస్థితి వేరు—అంటే ఆమె తన అర్ధాంగి అయాక, ఆమెపట్ల తాను చూపేది, సానుభూతి కాదు; విధ్యుక్త ధర్మ నిర్వహణ...ఆమె యాచించటం కాదు; కోరటమూ కాదు; తన హక్కును అమలు జరుపుకోవటం. ఒకవేళ అభిమానవతి ఐన సత్యవతి తనను నిరాకరిస్తే...?

యీ కొత్త వూహ అతనికి మింగుడు పడలేదు. ఆమె నిరాకరించే పెద్ద కారణం ఏముంటుంది? సత్యవతి తెలివి గలది కనుకనే, ఆమె జాగ్రత్తగా ఆలోచించే, రాబోయ్యే సిరికి మోకాలు అడ్డదు! అసలు అలాంటి ప్రవర్తన తను తేవటమే తడవుగా, గాలికి వొంగే గడ్డిపోచవలె ఆమె లొంగి పోతుందనే గట్టి నమ్మకం తనకు కలిగింది. అసలు ఇందులో తనకన్న ఆమెకే ఎక్కువ లాభాలున్నవి.

ఏమైనా కానీ—యీనాడు ఆమెతో పెళ్ళి ప్రస్తావన తేవటం, తేల్చుకోవటం జరిగి తీరాలి. ఏ విధంగానూ తనకు ఓటమి కలగదనే నమ్మకం అతనిలో గొప్ప పట్టుదలను సాధించింది. వాతావరణం కూడా చాలా అనుకూలంగా వుంది—అదృష్టవశాత్తూ పద్మ ఉదయమే మేనత్త గారింటికి వెళ్ళింది; మూడు రోజుల దాకా రాదు. యీ సంగతి సత్యవతికి తెలియదు కనుక, మామూలుగానే ఆమె వొస్తుంది; స్థాన బలిమి ఆధారంగా, తను స్వేచ్ఛగా మాట్లాడవొచ్చు!

సత్యవతి వొస్తుందేమోనని గేటువైపు చూశాడు. కాని ఎవ్వరూ లేరు...ఒక వేళ యీ తడి నేలలో వెళ్ళకుంటే నేమి లెమ్మని రాదేమో? ఆమె రాకపోతే తన ఆశా సౌధమంతా నేల కూలినట్లే! వొస్తుంది. కాని యీనాటి ఆమెరాక మాత్రం తనకొక ప్రత్యేకతను చేకూర్చుతుంది! యీ మధ్య తన యింటి ముందు నుంచి పడిన తారు రోడ్డు కూడా ఆమె రాకకు స్వాగతమే!

ఆమె రావటాన్ని గూర్చి తర్జన భర్జన చేసుకుంటున్నాడు సూర్యం! చివరకు విసుగుపుట్టి ఆమె వొచ్చాక దానంతట అదే తేలుతుంది లెమ్మని కూడా అనుకున్నాడు. దేనికైనా ఆమె రావాలి కదా!

ఎంత ప్రయత్నించినా ఆమె రాదనే నిశ్చయానికి రాలేక పోతున్నాడు; బహుశా ఆ వూహ బాధాకరమనేమో? ఆమె రావలసిన సమయం దాటి పోతూన్నది. మనసులో ఒక పక్క అశాంతి ప్రబలుతోంది; మరో పక్క ఆరని ఆశలు ప్రజ్వరిల్లేందుకు విశ్వ ప్రయత్నాలు చేస్తూనే ఉన్నవి. సూర్యానికి వేరొక ఆలోచన లేదు...ఆమె రాకకు నిరీక్షిస్తూ గేటు వైపే చూడసాగాడు!

ఒక గంట గడిచి వుంటుంది. ఆమె రావలసిన సమయం దాటి పోయినందునే నిరాశ అధికమవ సాగింది. సూర్యాస్తమయ మౌతూన్నది. వైధవ జీవితం - ఎంత స్వల్ప విషయాల మీద తిరుగుతూ వుంటుందా అనిపిస్తోంది సుర్యానికి.

వ్యధతో, బాధతో, నిరాశా పూరిత హృదయంతో, ముందు కార్యక్రమం సంగతి చూద్దామా అనుకుంటూండగా, గేటులో మెరుపు మెరిసినట్లయింది! వనదేవతల్లే సత్యవతి మందగమనంతో ప్రవేశిస్తోంది. సన్నగా పొడుగ్గా వున్న సత్యవతి! మెరిసే కళ్ళలోని కాంతిని ప్రసరిస్తూ, గాలికి రెపరెప లాడే పమిటను పట్టుకుంటూ, గర్వంగా నడుస్తోంది! ఆమె రాకకు మొక్కలు వొంగి స్వాగత గీతాలు ఆలపిస్తున్నవి. ముఖ కళను బట్టి చూస్తే ఆమె సంతోషంగా వుంది. వాన వెలిశాక వీచే చల్లనిగాలి ఎవరి మనసుకు మాత్రం ఆనందాన్నివ్వదు కనుక?

సూర్యానికి గ్రహాలన్నీ తనకు అనుకూలంగా కదులుతూన్నట్లున్నది. ఆమె రానట్లయితే జీవితపు బాధమాత్రమే మిగిలేది...అలాంటిది

ఇప్పుడామె వొచ్చింది. కనుక శేషించిన జీవితాన్ని వెలిగించుకునే ప్రయత్నాల్లో ఏ లోపమూ రానీకూడదు.

తమాషా—ఇంతకు ముందు నుంచీ తాను ఆలోచించుకొన్న, వూహించుకొన్న సంభాషణా వివరమంతా మరిచి పోయాడు. అంతే కాదు; ఎంతో ధైర్యంగా ఆమెతో మాట్లాడి తేల్చుకోవా లనుకున్నాడు! కాని ఆ ధైర్యమంతా క్రమంగా సన్నగిలింది. ఏదో గొప్ప నేరం చేయబోయ్యే వాడు, నేరస్తుడుగా పట్టుబడ్డ తరువాత, ఎదుర్కోబోయ్యే దుష్ఫలితాలను గూర్చి ఆలోచిస్తే, కలిగే భయం, కంపరం మొదలైనవి అతనిలో ప్రవేశించినయ్. ఇదసలు నేరమే కాదని సమాధాన పరుచుకునేందుకు ప్రయత్నించాడు. ఒక విధంగా చూస్తే ఇది నేరంకాదు. సరికదా—సత్యవతికీ, ఆమె కుటుంబానికీ తాను చేయబోయ్యే మేలు, ఇది నిజమే ఐనప్పటికీ, తన అంతరాత్మ యీ సత్యాన్ని మింగ లేకుండా తయారైంది; సత్యము నేరి ఒక్కొక్క సమయంలో వెగటుగా వుంటుంది కాబోలు!

ధైర్యాన్ని పుంజుకునేందుకు, మనస్సును వేరు ధ్యాసల మీదికి మళ్ళించుకునేందుకు సిగరెట్ వెలిగించాడు. ఇంతకు పూర్వం ఆ సత్యవతికి ఎదురు వెళ్ళి, ఆమెకు నచ్చ చెప్పి తనకు వధువును చేసుకోవాలని తల పోశాడు. కాని ఆమె తన దృష్టిలో పడింది మొదలు అతనికి కాళ్ళాడ లేదు. జరుగుతూన్న దానికీ, జరగ బోయ్యే దానికీ కేవలం ప్రేక్షకుడుగా మాత్రమే వుండిపోవట మొక్కటే మిగిలింది.

'ఛీ-ఛీ' అనుకున్నాడు. తన పిరికితనానికి తనను తాను నిందించుకున్నాడు. ఒక్క క్షణం ధైర్యంగా వున్న దాని విలువ, జీవితాంత సౌఖ్యమనే సత్యాన్ని మననం చేసుకున్నాడు. ఆ విలువను తలుచుకొని, అంత గొప్ప విలువైన వస్తువును పోగొట్టుకో కూడదని, దాన్ని సాధించేందుకు ఇదే సమయమని, ఇది దాటుతే మరి లాభం లేదని నచ్చ చెప్పుకున్నాడు. కూర్చున్న వాడల్లా లేచి బవర్ లోనే పచార్లు ప్రారంభించాడు.

కొత్త ధైర్యం అతన్ని కమ్మింది. లోకమే తలక్రిందు లవుగాక, ఏది ఏమైనా అవుగాక, రాబోయ్యే సదవకాశాన్ని ఎదుర్కొనేందుకు, రొమ్మిచ్చి పోరాడి సాధించేందుకు సిద్ధమైన దేశభక్తునివలె, ఫిరంగి గుండుకు ఎదురు వెళ్ళే సైనికునివలె తానుకూడా సిద్ధంగా వున్నాడు.

యుద్ధరంగంలో సైనికుడికి మరో ఆలోచన అనవసరం; అంత తీరికా వుండదు. సూర్యం మనస్తత్వం కూడా అలాగే తయారైంది! అంతే కాదు; విజయం తమదేనని రూఢిగా తెలుసుకో గలిగిన సైనికుని ఉత్సాహం లాంటి దాన్ని మనసులో పెంచుకున్నాడు.

ఇదంతా జరిగేలోగా సత్యవతి బంగళాలోకి వెళ్ళి తిరిగి వొస్తోంది. ఆమె బవర్ వైపే వొస్తుందో, లేక పద్మ లేదని తెలుసుకొని అటునుంచి అటే వెళ్ళిపోతుందో తెలియక బాధపడ్డాడు సూర్యం... కాని ఆమె బవర్ వైపే రావటంతో, తన అదృష్ట దేవత లందరూ కరుణించారన టానికి వేరొక తార్కాణం అనవసర మనిపించింది.

ఆమె మంద గమనంతో, వయ్యారంగా నడుస్తూంటే, వనలక్ష్మి కదలి వొస్తోందా అనిపించింది. వయస్సుకు తగ్గ యవ్వనమే చాలు— బీద సత్యవతి సహజ సౌందర్యాన్ని వెలిగించేందుకు! సంవత్సరాల తరబడిగా తనకు కనిపించని అందమంతా సత్యవతిలో యీనాడు కనిపించింది. యీ తోటే నందన వనమని తాను తలిచాడు; యీమె ఊర్వశి, తిలోత్తమలకు సాటిగా కనిపించటంతో, తన తోట నందన వనమే ననేందుకు సంకోచించాల్సిన పనిలేకుండా పోయింది! తను మూర్ఖుడై అంధుడై సంవత్సరాల పర్యంతమూ యీ విద్యుల్లతను గుర్తించ లేదు. తను తెలుసుకో లేకుండానే ఎంతో ఆనందాన్ని జీవితంలో పోగొట్టుకున్నాడు! కాని ఐపోయిన దానికోసం మర విచారించటం కన్న, జ్ఞానివలె మేల్కొని ఇక మిగిలిన కొద్ది జీవితాన్నైనా పాడు చేసుకో కూడదనే నిశ్చయానికి వొచ్చాడు!

సూర్యం యీ ఆలోచనలో మునిగి తేలు తూండటం వల్ల, సత్యవతి వొచ్చి బవర్ లో తనకు ఎదురుగా నిలబడిందన్న సంగతి కూడా గ్రహించ లేదు... చనువుగా వొచ్చి నిలబడింది; తనపట్ల ఆమె చూపే గౌరవానికి చిహ్నంగా, తల వొంచుకొని, ముందుగా తనచేత మాట్లాడించేందుకు వేచి వుంది.

సూర్యం చప్పున మేలుకొన్నాడు. పక్కనే వున్న కుర్చీ చూపుతూ ఆమెను కూర్చోమన్నాడు. మొదట్లో ఆమె అనుమానించినా, కాదనలేక కూర్చుంది.

'పద్మ వూరికి వెళ్ళిందటగా?' అందామె.

'ఔను. ఎల్లుండి కాని రాదు—'

రెండు నిమిషాలపాటు ఎవ్వరూ మాట్లాడ లేదు. ఎలా మాట్లాడాలా ఏం మాట్లాడాలా అని సూర్యం ఆలోచిస్తున్నాడు. ఆమె మాత్రం ప్రకృతి శోభను తిలకిస్తూ ఆనందిస్తూ వుంది.

ప్రణయ సంభాషణా క్రమం బొత్తిగా అలవాటు లేని మేళమైంది, సూర్యానికి. ఎక్కడెక్కడో పుస్తకాల్లో చదివిన సంభాషణల్ని జ్ఞాపకం చేసుకుంటున్నాడు; కాని ఏ ఒక్క సంభాషణా యీ సమయంలో పనికొచ్చేదిగా తోచలేదు. కనుక స్వతంత్రించి ఎక్కడో ఆక్కడ సంభాషణను మొదలు పెట్టి తనకు అనుకూలంగా తిప్పుకోవటం ఒక్కటే దారి! ఐనా పురుషుడు—ఒంటరి పాటున వున్న స్త్రీతో మాట్లాడ లేక పోవట మేమిటి! ఇద్దరి మంచీ ఇమిడి వున్న విషయాన్ని ప్రోచ్చరించటం నేరమా? తుదకు జయం తనదే ఐనప్పుడు తనకీ శంక లేమిటి?

'సత్యవతీ!' అన్నాడు.

తోటంతా కలయ చూస్తూన్న ఆమె, చప్పున తన దృష్టిని సూర్యం వైపు తిప్పింది—అతను చెప్పబొయ్యేదాన్ని శ్రద్ధగా వినేందుకు సిద్ధపడి.

'నేను నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను!'

ఆమెకు యీ మాటలు అర్థం కాలేదు; వింత భాషను వింటూన్నట్లు నిశ్చలంగా చూస్తూ ఊరుకుంది. ఆమె స్థితిని గ్రహించాడు.

'సత్యవతీ! నిన్ను పెళ్ళాడా లనుకుంటున్నాను—' అన్నాడు సూర్యం; డొంక తిరుగుడుగా, సున్నితంగా మాట్లాడా లనుకున్నాడు కాని, అది కుదర లేదు.

'ఏమిటీ!' అందామె, కళ్ళు పెద్దవి చేసి. తాను జీవితంలో ఊహించ లేని ఒకానొక సంఘటనకు చకితురాలైనట్లు!

'ఔను...నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో ఆ దేవుడికే తెలియాలి. నీవు లేకుండా మరి బతక లేననే సత్యాన్ని గ్రహించాను...నిన్ను పెళ్ళాడతాను—' ఆ తరువాత మాటలు మింగేశాడు. ఆమె కుర్చీకి పక్కగా మోకరిల్లాడు; ఇలవేల్పు ప్రత్యక్ష మైనప్పుడు భక్తుడు చూపే వినయాన్ని ప్రదర్శించాడు. ఆమె భావన ఏమిటోనని ఆత్రుతతో ఆమె

కళ్ళల్లోకి చూశాడు. పాపం—అతని కేమీ అర్థం కానట్లుగా శూన్య దృక్కుల్ని మాత్రమే ఆమె ప్రదర్శించ గలిగింది...

అతని తొందర అతన్ని వెంట తరిమింది. ఆమె జవాబుకు వేచి ఉండలేక పోయ్యాడు. మృదువైన ఆమె చేతిని పట్టుకొని ముద్దు పెట్టుకున్నాడు. ఈ చిటకా ఎంతవరకూ పనిచేసిందో నని ఆమె ముఖం లోకి చూశాడు.

ఆమె ముఖం - ముద్దుల మూటగట్టే ఆమె ముఖం—కందగడ్డవలె ఎర్రపడింది. అందమైన పెద్దకళ్ళు నిప్పుకణాల్ని కక్కుతూన్నవి. ఆ మూర్తిని చూసి సూర్యం వొణికి పోయ్యాడు. తాను కలలో కూడా వూహించని దుస్సంఘటన వొచ్చి పడుతోందని గ్రహించేందుకు ఎక్కువ సేపు పట్టలేదు.

గాజులు గల్లుమనేట్లుగా సత్యవతి తన చేతిని వెనక్కు లాక్కుంది. చప్పున లేచి నిలబడింది. ఆమె చేతికి తాను అందడు కనుక, కాలి తోనే మర్యాద చేస్తుందేమో ననుకున్నాడు, సూర్యం!

—కాని ఆమె అలాటి దేమీ చేయలేదు. అవమానంతో వొణికి పోతూ 'మీకు మతిపోయింది...బుద్ధి లేదు—' అందామె.

క్షణంలో తాను నేరస్థు డయ్యాడు. అదీ ఒకందుకు మంచిదే ననిపించింది; ఎందుకంటే—తాను నేరస్థుడు కాదని రుజూ చేసుకునేందుకు అవకాశం ఏర్పడింది.

ఏదో చెప్పేందుకు నోరు తెరిచాడు సూర్యం. కాని ఆమె అతన్ని మాట్లాడ నివ్వలేదు.

'నా కేమీ చెప్పక్కర్లేదు...ఇంత నీచానికి దిగుతారనుకోలేదు... వెధవ మొగాళ్ళు!' అని రుసరుస లాడుతూ మెరుపు తీగల్లే మాయమైంది.

ఆమె వెళ్ళిపోయిన రెండు నిమిషాల దాకా సూర్యం మళ్ళీ యీ లోకంలోకి రాలేదు. ఆమె ఖాళీచేసిన కుర్చీ పక్కనే ఇంకా మోకరించివున్న తన దుస్థితి తనకే ఎంతో హాస్యాస్పదంగా తోచింది.

చప్పున లేచి నిలబడి, తన అవస్థను ఎవరైనా గమనిస్తున్నారేమో నని కలయ జూచాడు: అదృష్టవశాత్తూ బవర్‌కు చుట్టూ అల్లుకున్న తీగ ఎంతో రక్షణను ఇచ్చింది. వంటవాడూ, నౌకరూ, డ్రైవరూ ఎవ్వరూ కూడా చూపుమేర దూరంలో లేరు. ఇంతవరకూ జరిగింది తన మధ్యా, సత్యవతి మధ్యా రహస్యంగానే వుండిపోవటం ఒక్కటే యీ దుస్సంఘటన తాలూకు తాను చూడగలిగిన అదృష్టం—అదే కాస్త గుడ్డిలో మెల్లగా అతనికి తోచింది.

షాక్ నుంచి తట్టుకున్నాక జరిగినదంతా మననం చేసుకో సాగాడు. సత్యవతి మాట్లాడిన ప్రతి అక్షరాన్నీ జ్ఞాపకం చేసుకున్నాడు...తలవని తలంపుగా ఎంతఘోరం జరిగింది!

ఎంతో గౌరవంగా బతుకుతూ, బాగా చదువుకొని, చదువుకు తగిన సంస్కార ముండి, లోకానుభవం వుండి, ఏళ్ళ తరబడిగా కాపరం చేస్తూ, స్త్రీ అంటే ఏమిటో తెలుసుకో దగిన తను, పెద్ద మనిషిగా గుర్తించ బడిన తను—యీ సాయంత్రాన, మూర్ఖుడని రుజూ చేయబడినాడు! స్త్రీ మన స్తత్వం తెలుసనుకొని తాను గర్వించటం వొట్టి భ్రమ!

ఆ జరిగిన సంభాషణను నెమరు వేసుకుంటే, తను అతాత్తుగా ఆమెను పెళ్ళాడమని కోరటం పెద్ద పొరపాటల్లే తోచింది. సంభాషణా క్రమం పెద్ద జలపాతమల్లే తయారైంది. ఆమె మూడ్‌లోకి రాకముందే తను త్వరపడ్డాడు! ఆమె రాకపూర్వం తను ఆలోచించిన విధానమంతా ఆమెకు విడమరచి అరమయేట్లు చెప్పినట్లయితే, యీ ప్రమాదం సంభవించేది కాదు. ఆమె తయారుగా లేక పోవటమే, యీ తారుమారుకు కారణం!

ఏమైతే నేం—ఆమె తనను తృణీకరించింది. ఆ నిరాకరణైనా నిరాదరణ ఉట్టిపడే విధానంలో వుంది! కనీసం 'ఆలోచించి చెపుతాను' అని ఆ తరువాత నిరాకరించినా యింత బాధ వుండేది కాదు... అసలు తను అడివి మనిషల్లే, కనీసం సభ్యత తెలియని వ్యక్తల్లే, ప్రవర్తించటమే యీ దారుణానికి దారితీసింది. తనకు విజయం తధ్యమనే గుడ్డి నమ్మకమే యీ గోతిలోకి తోసింది...యీ సారి మరో అవకాశమే దొరుకుతే...?

'ఇంకానా?' అని గొణుక్కున్నాడు వెంటనే సూర్యం. పీడ కలను ఎవరైనా తిరిగి కనాలనుకుంటారా? అసలు యీ అవకాశమే దొరకనట్లయితే తన మనశ్శాంతి భగ్న మయేది కాదు; అలాటిది మళ్ళీ వొస్తే ఎలా పరిణమిస్తుందో?

కేవలం ఆత్మ తృప్తికోసం తనామెను పెళ్ళాడ మనటమే తడవుగా, ఆమె తన అంగీకారాన్ని చిరునవ్వుతో జారవిడుస్తుందని వూహించాడు! ఎంతకూ తనకు అనుకూలంగా వున్న వాదనలనే బలపరుచుకున్నాడు కాని, ప్రతికూలంగా వున్న వాటిని దాదాపు విస్మరించాడు.

తను 'ఆమె' గా భావించి ఆలోచించుకోవాల్సింది; అందాకా ఎందుకు—ఎంత డబ్బున్న వాడైనా దాదాపు సత్యవతి యీడుదే ఐన పద్మను, తన వయస్సువాడి కిచ్చి పెళ్ళి చేయవలసి వొస్తే...పద్మ సంగతి అలా వుంచి తనెంత బాధపడే వాడు! ఒక్కటే భేదం — తనకు డబ్బున్నది కనుక, దాని విలువ సత్యవతి దృష్టిలోని విలువంత ఉండేందుకు వీల్లేదు...ఐనప్పటికీ చూస్తూచూస్తూ తన కుమార్తెను ఆరు నూరైనా ముసలాడికిచ్చి గొంతు కోయలేడు గదా! తనే ఆ పని చేయలేనప్పుడు, సత్యవతిలాంటి లోకజ్ఞానమున్న యువతి, తన గొంతును తానే కత్తిరించుకునేందుకు సిద్ధమౌతుందని, తను వూహించటం, ఎంత హాస్యాస్పదం!

విశాలంగా ఆలోచిస్తే ఆమె అవమాన పరిచింది తనను కాదు... డబ్బు విలువను! ఏదో ఉద్రేకంలో ఆమె క్షణంలో ధనవంతుణ్ని కాలతన్నినప్పటికీ, ధనం విలువను తగ్గించటం ఎవడితరం? మరు క్షణంలోనే డబ్బు అవసరాలు ఆమెకు అర్థమవక పోవు; వెంటనే తను చేసిన పొరపాటు గ్రహించి పశ్చాత్తాప పడక తప్పదు. ఇష్టాయిష్టాలు వేరు; అవసరాలు వేరు. అవసరాలకు బానిసకావటం ప్రకాస్త ఇంచుమించుగా అందరికీ తప్పనిసరే! ఆమెకు అవసరం కనుక ఆమె దానికి తల వొగ్గుతూంది: తనకు ఆమె అవసరం కనుక ఆమెకే తల వొగ్గుతాడు. ఇద్దరి పట్లా అవసరమనేది వేరు వేరు రూపాలలో లొంగదీయటం కనిపిస్తూనే వుంది...

కాని ఆమె యీ అవసరాన్ని గూర్చి ఎక్కువ ఆలోచించ లేదు. ఐనా ఏమిటి తనకీ పిచ్చి? ఒకోవ్యక్తి పట్టుదలలో ఎంత కష్టాన్నయినా

భరించేందుకు సిద్ధమౌతాడు. యీ సత్యవతి మన స్తత్వం అలాటిదే కావొచ్చు. ఆమె మన స్తత్వం, దాన్ని గూర్చి ఆలోచించి, బుర్ర చెడ గొట్టు కోవటం తన పని ఐంది! జరిగింది చాలక, తానీ సమస్యను పట్టు కొని ఇంకా వేళ్ళాడటం ఏమిటి?

అంత తేలిగ్గా మరిచి పోవటం సాధ్యమా? యీ వ్యవహారం తను వూహించ నంతగా ఇలా ఎదురు తిరుగు తుందనుకుంటే, మొదట్లోనే తన అభిప్రాయాన్ని. మొదలంటూ రూపు మాపు కునేందుకు ప్రయత్నించే వాడు! కాని జరగబొయ్యేది ముందుగానే తెలుస్తే జీవితంలో చాలా విషాద సంఘటనలు జరగకుండానే జాగ్రత్త పడొచ్చు; అది తెలియక పోవటమే జీవితం మీద ఒకరకం ఆసక్తిని పెంచుతోందనే సత్యాన్ని సూర్యం యీ క్షణంలో గ్రహించ లేక పొయ్యాడు!

తను ఎంతో తెలివైన వాడనీ, వ్యాపారంలో నేమి, లౌకిక వ్యవహారాల్లో నేమి చాలా బాలెన్స్‌డ్‌గా ప్రవర్తించ గలిగే సమర్థుడనే గర్వం తనకు వుండేది. ఒక రకంగా జీవితానుభవాన్ని జ్ఞానంగా సంపాయించ గలిగిన తను, స్త్రీ దగ్గర మాత్రం మూర్ఖుడై పొయ్యాడు! ఎంత నీచం! కాని మహాజ్ఞానులు సైతం స్త్రీ దగ్గర మాత్రం తమ జ్ఞానాన్ని దమ్మిడీకి కూడా చెల్లకుండా చిత్తు చేయబడటాన్ని మాత్రం సూర్యం గ్రహించ లేదు!

యీ ఐనదాన్ని గూర్చి తల బద్దలు చేసుకోవటం చాలా అనవసరంగా తోచింది; ఎందుకంటే ఆ సంఘటనలో వేరు విధంగా ప్రవర్తించి యీ అవమానాన్నీ, క్షోభనూ దూరం చేయుటం కుదరదు - అది తిరిగి సంభవించదు కనుక! కాని జరగ వలసిం దేమిటి? జరిగే దేమిటి?

ఇది తలుచు కున్నప్పుడు జరిగిన దుస్సంఘటన, జరగబొయ్యే దుస్సంఘటనలో ఒక భాగమే నేమో ననిపించింది... ఎందుకంటే సత్యవతి తను అనుకున్నంత లోకజ్ఞానం గల ఆడదిగా తోచదు. ఏళ్లు పైబడి నప్పటికీ, ఒకరకం అమాయకత్వం, చిన్నతనం ఆమె ప్రవర్తనను స్పష్టం చేసినవి. నిజానికి తను ఆమెకు హాని చేయక పోయినప్పటికీ, తన కన్యాత్వమే భగ్న మైనట్లుగా గోరంతలు కొండంతలు చేసుకొని, తన తృప్తి కోసమైనా పెద్ద వాళ్ళతో చెపితే...?

ఇంకా ఏమన్నస్తే ఆమె పట్ల తన ప్రేమనూ, అభిమానాన్నీ ప్రకటించాడు. దానికి ఆమె అంగీకారమో, అనంగీకారమో తెలియపరుస్తే సరిపోతుంది. ఆ పైన ఆ సమస్య మరి ఉండదు; ఇందులో బలవంతమేమీ లేదు. మారం ఆలోచిస్తే ఇది కేవలం తనకూ, ఆమెకూ సంబంధించిన వ్యక్తిగత విషయం. ఇద్దరూ కలిసి తేల్చుకుంటే సరిపోతుంది... కాని తనవలె ఆమె ఆలోచించ లేదు. అలా ఆలోచించ గలుగుతే, ఆమె అంగీకారమే తనకు లభ్యమయ్యేదిగదా!

పోనీ తన ధోరణిలోనే ఆలోచించుకున్నప్పటికీ, ఆమె తనకేదో గొప్ప అవమానమే జరిగిందనుకొని, తనను విపరీత వ్యక్తిగా చిత్రించి వీధి వీధంతా టముటమా వాయిస్తే...? అందువల్ల తను చిన్నబోవటమూ, లేదా ఆమె తలిచే అవమానం లాంటిదే తనకూ చుట్టుకోవటమూ. అదే సమయంలో సత్యవతి పాతివ్రత్యమూ(!), ఆమె మంచి అభిరుచులూ, భారతీయనారి నరనరాల్లోనూ ప్రవహించే స్వశీల రక్షణా తత్పరతా ప్రదర్శించ బడుతవి! ఇతరుల అవమానం సంగతి అలా వుంచి, తన గొప్ప ప్రదర్శించుకునేందుకు ఇంతకన్నా సదవకాశం ఆమెకు మరి దొరుకుతుందా?

వీధిలోని జనమంతా కలిసినా తనకు శారీరకంగా మరేమీ భయం లేదు; కాని తనను ఎంతో గౌరవంగా చూసే యీ సమాజం, తన మొహం మీద ఉమ్మివేయక పోవచ్చు. కానీ, వారి మనసుల్లో తనెంత నీచుడుగా చిత్రించబడతాడు! ఏళ్ళతరబడిగా తాను సమాజానికి దాసానుదాసుడుగా వున్నాడు; ఎంతో విశ్వాసనీయంగా ప్రవర్తించాడు. ఐతేనేం—యీ ఒక్క చిన్న తప్పూ చాలు, తన మానమర్యాదలు మంటగలిపి, సమాజంలోని తన స్థానం తాలూకు పునాదుల్ని కదిపేందుకు! పై పెచ్చు యీ కాస్త తప్పుకూ చిలువలు పలువలు అల్లి, కట్టుకథల్లో తనను మరింత నీచుడుగా ప్రచారం చేసేందుకు చాలా మంది సిద్ధంగా ఉంటారు; ఎందుకంటే సమాజంలో తనలాంటి పెద్దలే ఇలాంటి నీచాలకు పాల్పడుతున్నారనే ప్రచారంతో, తక్కువ స్థానాలను ఆక్రమించుకున్న వారి అనేక తప్పులకు ఒక విధంగా క్షమ లభ్యమవక తప్పదు గనుక.

ఇంత బతుకూ బతికి, ఇంటి వెనకాల చచ్చినట్లు - తన నేవో దుష్ట గ్రహాలు వెంటాడటం వలననే నేమో యీ ఊబిలో పడ్డాడు!...యీ సత్యవతి యెవరితోనూ చెప్పకుండా వుంటే అదే పదివేలు అనుకున్నాడు. ఆమె ఎదురుగా వున్నప్పుడు యీ ఆలోచనలు రాలేదుకాని, వొచ్చినట్ల యితే ఆమె కాలితో తన్నినా సరే, ఆ కాళ్ళు పట్టుకొని, ఎవరితోనూ చెప్పనని ప్రమాణం చేసేదాకా వొదిలేవాడు కాదు; నలభై సంవత్సరాలుగా గడించిన గౌరవానికి యీ కాస్త వెలా ఒక లెక్కలోది కాదని పెద్ద మనిషైన తనకు తెలుసు!

కాని అంతా చేయి జారిపోయింది. కేవలం ఆమె మన స్తత్వం మీదనే తన మానమర్యాదలు ఆధారపడి వున్నవి. ఏమౌతుందో! తనకు అనుకూలంగానే పరిసితులు మారుతయ్యనుకునే ఒక్క కారణాన్ని కూడా అతను చూరనివ్వటం లేదు; ఎందుకంటే యింతకుముందే యిదే పెడ మార్గంలో ఆలోచించి యీ గోతిలో పడ్డాడు. తిరిగి ఆ పొరపాటే చేసి యీ గోతి తాలూకు లోతును పెంచుకోవటం కన్న, బుద్ధి తక్కువ మరి వుండదని అతనికి తోచింది. ఇదే కారణంగా అంతా ప్రతికూలతనే సృష్టించుకో సాగాడు...

వాతావరణమంతా చాలా అశాంతిగా కనిపించింది. ఈ వెధవ ఉద్రేకాన్ని కల్పించిన యీ వాతావరణాన్ని కసి దీరా తిట్టుకున్నాడు. కాని యిప్పుడు ఆ ఉద్రేకం చల్లారాక, తను భరించాల్సిన యితర కోపాలను గూర్చిన బాధ అధికమైంది.

అవబోయ్యే గోలనూ, పొందవలసిన అవమానాన్ని గూర్చి ఆలోచించే కొద్దీ కంపరం పుట్టింది. అది తప్పదని ముందుగానే గాఢ నమ్మకము కలిగింది కనుక, అందుకు సిద్ధమౌతూనే వున్నాడు...కాని, నిజంగానే ఆ అవమానాన్ని భరించక తప్పని పక్షంలో, తను రెండు రకాల క్షోభకు గురవుతాడు; ఒకటి-సత్యవతి తనకు దొరక్కపోవటం, రెండు-తాను అవమానితుడు కావటం...సత్యవతి తనకు లభ్యమయాక అవమానం జరిగినా, ఒక లాభాన్ని అంటిపెట్టుకొనివున్న నష్టంలాగే దాన్ని స్వీకరించేవాడు. తను అనుభవించిన దానికి ఒక రకంగా విలువ చెల్లించాననే ఆత్మ తృప్తయినా మిగిలేది. కాని ఇప్పుడో—? ఎండమావుకు భ్రమించి, భంగపడ్డట్లయింది!

తను యింతకుముందు నిందించిన ఉద్రేకాన్ని గూర్చి యిప్పుడు, యీ కాంతిలో విమర్శిస్తే, అదెంత బలహీనమైనదో అర్థమౌతోంది! ఎందుకంటే ఆమె నిరాకరణతో ఆ ఉద్రేకం పటాపంచలై, తీక్షణ సూర్య కిరణాల తాకిడికి మంచు కరిగినట్లు కరిగి ప్రవహించి పోయింది!

నిజంగా అదే శక్తివంతమైన ఉద్రేకమైనట్లయితే, తనను నిలవనిచ్చేదా? సత్యవతి మనస్తత్వం ఎలాటిదైతేనేమి – ఆ క్షణంలో ఆమెను అనుభవిస్తేనే కాని ఆ ఉద్రేకం చల్లారి వుండవలసింది కాదు! అలాటి ఉద్రిక్తతను తృప్తి పరిచేందుకు తను కోల్పోయినలాటి సదవకాశం జీవితంలో మరి దొరుకుతుందా? రావణుడు రంభనూ, కీచకుడు సైరంధ్రినీ కోరారంటే, వారి ఉద్రేకాలు ఎంత గాఢమైనవో యీ సమయంలో సూర్యానికి బాగా అర్థమైంది.

అసలు తను ఆమెను బలాత్కరించే ఉండవలసింది! ఆమెను కోరటంవల్ల తానొక బుద్ధిహీనుడయ్యాడు; ఆమెను అనుభవించే అవకాశాన్ని జారవిడవటంవల్ల మరోసారి బుద్ధిహీనుడయ్యాడనే నమ్మకం అతన్ని వేధించింది. ఆ అనుభవమన్నా తనకు దక్కినట్లయితే, తాను వూహించిన యీ అవమానాన్ని తను నవ్వుతూ స్వీకరించేవాడు.

ఈసారి నిజంగానే ఆమె ఒంటరిగా తటస్థ పడట్లయితే, తను జరపబొయ్యే రాక్షస కృత్యాన్ని సాధ్యమైనంత వికృతంగా సృష్టించుకొని ఆనందించాడు. అలాటి స్త్రీకి తగిన సత్కారం అదేనని అతని నమ్మకం. ఆ తరువాత తను ఛస్తేమాత్రమేం? స్వర్గంలో లభ్యమయ్యే ఊర్వశీ రంభల పొత్తు తనకు భూలోకంలోనే దొరికేది!

తిరిగి తిరిగి క్రూరంగా, క్రూరతరంగా, క్రూరతమంగా ఆమెను బలాత్కరించి, హింసించి, తన పశుబలానికి ఆహుతి చేసి బాధించటాన్ని గురించి రకరకాలు గానూ ఆలోచించుకో సాగాడు. నిజంగానే ఆమె ఎదట వున్నట్లుగా భ్రమించి గాలిలోకి చేతుల్ని విసిరాడు...

కాని అదంతా వొట్టి ఊహనే సంగతి వెంటనే తెలిసింది. ఒకే సంఘటన వ్యక్తిలో కలిగించే వివిధ భావోద్రేకాలకు గురవుతూండటాన్ని తను గమనించాడు. ఒక్కటి మాత్రం తథ్యం—యీ సారి ఆమె ఒంటరిగా చిక్కితే ఆమెను బలాత్కరించి పరాభవించి తృప్తి

పడతాడు. తప్పదు; తరువాత తాను అవమానితుడైతే అవుగాక. దేవి కైనా ఆమె మళ్ళీ ఒంటరిగా తారసిల్లాలి కదా!

ఆరు సంవత్సరాలుగా తనలో కలగనంత స్త్రీ వాంఛ యీనాడు తనకు కలిగింది. బహుశా ఆరేళ్లుగా కామాన్ని తొక్కి పట్టటం వల్ల అది ఒక్కసారిగా విశ్వరూపం దాల్చి ఉండొచ్చు! తాను అనుభవించే మనశ్శాంతికి గొడ్డలి పెట్టుగా ఇది పరిణమిస్తుందని వూహించక పోవటం కూడా తన అజ్ఞానమే కావొచ్చు. కాని తెలిసిన తప్పునే చేయకుండా వుండలేని మానవ దౌర్బల్యం సూర్యం పట్ల రుజూ ఐంది.

ఈ వెధవ ఆలోచనలతో తనను తాను వేధించుకోవటం కన్న మనస్సును సంతోష పెట్టవలసిన అవసరం ఉన్నదని అతనికి గుర్తొచ్చింది. అసమర్థునివలె, తన బాధకు తానే సానుభూతి చూపుకో లేని అజ్ఞాని వలె యీ బవర్ లోపల పడి వుండటం హాస్యాస్పదం గానే తోచింది. వెంటనే బయలుదేరి కాళ్ళీడ్చుకుంటూ, సూదులల్లే కాళ్ళకు తగిలే గడ్డి పోచల మీద ఎత్తి ఎత్తి అడుగులు వేస్తూ, అతను బంగళాలోకి వచ్చాడు.

గదిలోకి పోయి కూర్చోగానే, బవర్లో వొదిలించుకున్నాననుకున్న ఆలోచనా పరంపర, దానంతటదే తిరిగి ఆక్రమించింది. తాను అవమానితుడైనా ఫర్వాలేదు... కాని తన కూతురు పద్మకు యీ సంగతి తెలుస్తే? ఈ తండ్రికి కూతురైనందుకు ఆమె ఎంత ఖేద పడుతుంది! తన గౌరవ మర్యాదల ఆధారంగా ఆమె పెరుగుతూన్నది; యీనాడు ఆ ఆధారమే విషమ స్వరూపం దాల్చితే, ఆమె జీవితం ఏంకాను? ఎంతో అభిమానవతి ఐన పద్మ, యీ అవమానాగ్నికి ఆహుతి ఐనా ఆశ్చర్యం లేదు! నిజంగా అలాగే జరిగితే, తను జీవచ్ఛవంవలె బతకటం ఎంత అనవసరమో అర్థమవుతూనే వుంది!

ఇంతా ఏడుస్తే, తను గోరంతలు కొండంతలుగా సృష్టించుకొని, దారుణ ఫలితాలను గూర్చి ఆలోచిస్తున్నాడేమో? అవమానం జరగటం కన్నా, అవమానం జరిగిందని పదిమందికీ తెలియటమే నిజమైన బాధ అనే సత్యం తాను ఎరగంది కాదు. యీ సిద్ధాంతం ప్రకారం, సత్యవతి తాను అనుకునే అవమానాన్ని పదిమందికీ చెప్పదేమో? చేతనైతే ఒంటరిగా తనను ఎదుర్కోవటమో, లేక జరిగిందాన్ని గూర్చి బాధపడకుండా అంతా మరిచిపోయి, తిరిగి అలాంటి పరిస్థితుల్లో ఇరుక్కోకుండా జాగ్రత్త

పడటమో చేస్తుందేమో ? ఎలా ప్రవర్తించబోతోందో, కేవలం దాని మీదే తన జీవిత మాధుర్యమంతా ఆధారపడి వుంది ! చూస్తూ చూస్తూ తన స్వేచ్ఛను, ఆనందాన్ని సత్యవతి పాదాల ముందుంచి అసమర్థునివలె, ఆమె దయకు మాత్రమే వేచి కూర్చునే ఘోర పరిస్థితిని చేజేతులా కల్పించుకున్నాడు !

తన మీద తనకు కలిగిన అసహ్యం భరించరానంతగా వుంది. ఏమైతేనేం—జరగబొయ్యేదేదీ తన చేతుల్లో లేదు. గాలినిబట్టి పోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. తన పతనం తప్పదు—ఐతేనేం తను ఇప్పటి నుంచే దిగజారటం ఏమిటి? జీవితంలో విస్మరించిన అనేక సౌఖ్యాలు యీ క్షణంలో అతనికి గుర్తుకొచ్చినవి.

ఆశలు వొదులుకున్న రోగిమీద డాక్టర్ చేయరాని పరిశోధనల్ని జరపగలడు. ఉరిశిక్ష పడ్డ ఖైదీ, రాబొయ్యే తన చావును గూర్చి ఆలోచించి ఆలోచించి, చివరకు మనస్సును రాయి చేసుకోక తప్పదు; ఎలాగూ చావు తప్పదు కనుక, చావబొయ్యే ముందు అవకాశమున్నంత వరకూ ఆనందించే సాధనాల కోసం వెతకవచ్చు. ఇలాంటి మనస్తత్వమే సూర్యంలో కూడా ప్రవేశించింది. రేపటి సంగతి దేవుడికెరుక; ఇప్పటి నుంచే భయపడటం వల్ల, బాధపడటం వల్ల ప్రయోజనం లేదు. ఎలాగూ తన గౌరవ మర్యాదలకు భంగం వాటిల్లే ప్రమాదం కనుచూపు దూరంలో వుంది కనుక, ఆ గౌరవ మర్యాదలకు తాను ఇన్నాళ్ళుగా ఇస్తూన్న విలువను తగ్గించుకోవటం వల్ల, తాను పడే బాధ కూడా తగ్గి తీరుతుంది.

యీ సూత్రాన్ని గ్రహించగానే, గౌరవాన్ని నిలబెట్టుకునేందుకు గాను, తాను ఏళ్ళ తరబడిగా పడ్డ శ్రమా, అందుకోసమై తాను కావాలని వొదులుకున్న అనేక సౌఖ్యాలూ, కేవలం తనను మూర్ఖుణ్ణిగా తయారు చేసిన సంగతి గ్రహించాడు. ఆ సౌఖ్యాలను రుచిచూసేందుకు ఇప్పుడే ఒక అవకాశం ఏర్పడింది; యీ కొత్త అవకాశాన్ని వృధా పోనివ్వకూడదనే నిశ్చయం అతనికి కలిగింది.

ఒకో దుర్ఘటన మానవుణ్ణి కుంగదీస్తుందనుకోవటం పొరపాటు; అది అదివరకు మనిషిలో లేని కొత్త శక్తిని, కొత్త మనస్థైర్యాన్ని, ధైర్యాన్ని కూడా ప్రసాదించగలుగుతుంది; ఒక దెబ్బ తగిలి, దాన్ని

తత్వాలలో కలిగాక, అంతకన్న పెద్ద దెబ్బకు కాని మనిషి చలించడు. ఈ న్యాయాన్ని అనుసరించే గౌరవ మర్యాదల విలువను వేరు రూపంలో పొందాలని సూర్యం నిశ్చయించుకున్నాడు.

—అంటే, తన పెద్ద మనిషి తనాన్ని కాపాడుకునేందుకని ఈ ఆరేళ్ళూ బ్రహ్మచర్యాన్నే గడిపాడు. కాని యీనాటి పరాభవం తనలో రేపిన మంటల వేడికి ఆ బ్రహ్మచర్యం మసయి పోవాల్సిన స్థితి ఏర్పడింది; అందువల్ల తన పెద్ద మనిషి తనానికి భంగం వాటిల్లినా ఫర్వాలేదు. ఎందుకంటే ఆ వార తాను కొత్త అనుభవాన్ని, ఆనం దాన్ని పొందగలుగుతున్నాడు!

యీ కొత్త అనుభవం—అసలు వస్తువు లభ్యం కానప్పుడు, నకిలీ వస్తువు మీదికి పోయ్యే మమకారం లాంటిదే కావొచ్చు. తృప్తిలో కొద్ది భేదం వున్నా, అసలు తృప్తంటూ ఉండకపోదు; కనీసం తనలో కలిగిన యీ అశాంతి కొంతవరకన్నా సమాధాన పడుతుంది. పాడైన యీ మనస్సుకు, తనచుట్టూ పిడకలల్లే ఆవరించిన యీ ఆలోచనలనుంచి ముందు విముక్తి కావాలి. ఎవరైనా. ఏ విలువకైనా సరే ఏ విధానంలోనైనా సరే, ప్రస్తుతం తన [illegible] దుస్థితిని మరచిపోయ్యేటట్లు చెయ్యగలుగుతే చాలు! అంతకన్న, తను మరేదీ కోరడు.

ఔను...తను పుస్తకాల్లో చదివాడు; విన్నాడు; వెలకు స్త్రీలు లభ్యపడతారని! ఇన్నాళ్ళూ యీ విషయాన్ని గూర్చి ఎన్నడూ తను సీరియస్‌గా ఆలోచించలేదు; అంత అవసరమూ కలగలేదు. మొదటినుంచీ అలాంటి స్త్రీలు చాలా నీచులని, వేరుపురుగులని, వారి గాలి సోకుతేనే తాను అపవిత్రుడౌతానని అభిప్రాయం ఉండేది. కాని యీనాడు తానే పతనం చెందిన స్థితి రానే వొచ్చింది. అంటరానివాడికి మరో అంటరాని వాడు సన్నిహితుడే అవుతాడు. అదేవిధంగా ఆ వెలయాళ్ళను తాకే అర్హత ఇదివరకు తనకు లేకుండా పోయింది; కాని యీనాడు పరిస్థితుల వొత్తిడితో ఆ కొత్త అర్హత తనకు సంక్రమించింది.

కేవలం తను విన్నాడు—వాళ్ళను గూర్చి. విన్నదానికీ అనుభవంలో తెలుసుకునే దానికీ తేడా తప్పకుండా వుంటుందనే సత్యం ఆతనికి తెలియక పోలేదు. కనుకనే పూర్వం వృత్తిగా వ్యభిచరించే వారి

మీద తాను కలిగించుకున్న హేయాభిప్రాయం తాలూకు బలాన్ని, తగ్గించుకోక తప్పలేదు.

అంతేకాదు. తాను ధనవంతుడుగా సంపాయించలేని సత్యవతి పొందును, అదే ధనంతో వేరొకరూపంలో సంపాయించ గలుగుతేనే కాని, తనమీద తనకు కలిగిన అసహ్యం తగ్గదు. ధనంతో పొందగలిగే సౌఖ్యం ఎలాటిదో, ఎంతవరకూ కార్యసాధనకు ధనం అనుకూలిస్తుందో మరోసారి ఆత్మతృప్తి కోసమన్నా తను రుజూ చేసుకోవాలి.

తాను మరింతగా పతనమౌతున్నానేమో ననే అనుమానం అతనికీ కలిగింది! సన్మార్గుడు దుర్మార్గుడవటం కష్టంకాని, దుర్మార్గుడు, పరమ దుర్మార్గుడుగా మారటం ఆటే కష్టంకాదు. మేడ ఎక్కేప్పుడు మెట్లమీద అసలు జారకుండానే ఉండేందుకు జాగ్రత్తపడాలి; తీరా జారాక, ఏ మెట్టు దగ్గర ఆగుతుందనేది ఎవరు చెప్పగలరు? యీ న్యాయాన్ని అనుసరించే, ఇంతవరకూ తమ పతనమవగా లేంది, మరి కాస్త పతనమైనప్పటికీ (?) కలిగే ఇబ్బందీ, పొంచేప్రమాదమూ ఏమీ ఉండదని అతనికి అనిపించింది.

మొదటి నుంచీ పట్టుదల గలవాడు కనుక, సూర్యం యీ కొత్త అనుభవాన్ని పొందేందుకు వెనుకడుగు వేయవలసిన అవసరం లేదు. పైగా తగినంత ధైర్యాన్ని కూడా పుంజుకున్నాడు.

వెంటనే ఇనుపపెట్టె తీశాడు—కావాల్సిన పైకం తీసుకుందామని. కాని ఇనపపెట్టెలోని నోట్ల కట్టలకన్న రివాల్వరే అతని దృష్టిని ముందుగా ఆకర్షించింది. దాన్ని పైకితీసి చేతుల్లో అటూ ఇటూ తిప్పుతూ పరిశీలించాడు—

యీ రివాల్వర్ కొని దాదాపు పుష్కరం అవుతుంది; కాని దాన్ని ఉపయోగించవలసిన అవసరం ఇంతవరకూ కలగ లేదు. – ఇప్పుడు తను పొందే యీ మనోవ్యధను శాశ్వతంగా ఇది మరిపించగలదు—తనకు మరి సమస్యలవేవీ ఉండవు...

'ఛీ ఏమిటీ పిచ్చి' అనుకున్నాడు సూర్యం. ఆత్మహత్య చేసుకుందామనే తలపు అతనికి ఇంతకు ముందెన్నడూ రాలేదు. పైగా ఆత్మహత్య చేసుకునేవాళ్లు పిరికివాళ్ళనీ, నిష్ప్రయోజకులనీ, తమ అసమర్థతను ప్రకటించేందుకే వాళ్లాపని చేస్తారనీ అతని అభిప్రాయం; అలాటి

ళ్ళనుచూసి అతనెప్పుడూ జాలి పడలేదు; కాకపోగా పరిహాసంగా నవ్వాడు కూడాను! అలాటి తన కీవేధవ ఆలోచన కలగట మేమిటి?

ఒకరకంగా చూస్తే, యీ పిచ్చి ఆలోచన వొచ్చేందుకు, అరవై నిమిషాలక్రితం జరిగిన సంఘటనా, దాన్ని గూర్చిన అతని మనోభావాలూ అందుకు కారణం అనవచ్చు. వంశగౌరవాన్నీ, మాన మర్యాదలనూ, తాను అమితంగా ప్రేమించే ఏకైక పుత్రిక పద్మ జీవితాన్నీ, ఉద్ధరించవలసిన తన బాధ్యతను, యీ రివాల్వర్ గుర్తు చేసింది. ఐతే తాను వూహించిన పరిస్థితులే నిజంగా ఏటపడినట్లయితే, పన్నెండేళ్ళనుంచీ నిద్రపోతూన్న ఈ రివాల్వర్ మేలుకోవటం, తాను మాత్రం దానిసాయంతో శాశ్వతనిద్రకు దారితీయటమూ జరగటం తప్పదు; సకల సమస్యలూ యీ విధంగా పరిష్కరించ బడుతవి; ఒకవేళ పరిష్కరించబడక పోయినప్పటికీ, తన బాధ్యతను నిర్వహించి నట్లన్నా అవక పోదు.

తన గ్రహాలన్నీ పూర్తిగా ఎదురు తిరిగినవని తెలుసుకున్న క్షణంలో చిట్టచివరి ప్రయత్నానికి ఇదొక్కటే తారకమంత్రం! కనుక దీన్నిగూర్చి ఇప్పుడే ఆలోచించటం అనవసరం. తనకీ చావుతప్పని పక్షంలో ఆ మిగిలిందికూడా అనుభవించే చావటం మంచిది. ఎంత మూల్యమైనా చెల్లించే వెలకు దొరికేందుకే చూస్తాడుకదా!

రివాల్వర్ను అవతల పెట్టేశాడు. దీన్నిగూర్చి ఆలోచించాక తనకు ఎంతో ఘోరంగా, భయంకరంగా, కనిపించిన సమస్య చాలా తేలికైనట్లూ, తలమీది పెద్దబరువు దింపేసినట్లూ, అనిపించింది సుందరానికి.

తరువాతి కార్యక్రమం కోసం తొందరపడే అతని మనస్సును, సమాధాన పరిచేందుకు, చెయ్యి నోట్ల కట్టలమీదికి వెళ్ళింది. ఎంత డబ్బు కావాలవేది తేల లేదు. తనకు 'అలలు'రాని వ్యవహారంలో జొరబడ బోతున్నాడు. ఏమైనా కొంచెం ఎక్కువ మొత్తాన్నే దగ్గర ఉంచుకోవటం మంచిదని తోచింది. ఎందుకంటే యీ నాడు జీవితంలో ఎన్నడూ ఎరగని గొప్ప అనుభవంలో తను పాల్గొన బోతున్నాడు.

మూడు వేలు తీసుకున్నాడు; మళ్ళీ ఆలోచించి మరో వెయ్యి కూడా జేబులో, పెట్టుకున్నాడు.

బైటికి వెళ్ళబొయ్యేముందు బీరువాకు బిగించిన పెద్ద అద్దంముందు నిలబడ్డాడు. ఇంతకు ముందు తోటలోకి వెళ్ళబొయ్యేప్పుడు చూసుకున్న

ప్రతిబింబానికి, ఇప్పటి తన ప్రతిబింబానికీ పోలికే లేదు. నిజానికి కాల చక్రం ఒక గంటకు కాస్త పైగా తిరిగినప్పటికీ, జీవితంలో పదేళ్లు గడిచినంతగా మారిపొయ్యాడు! తను పడే ఈ అంతర్వేదనను తన ముఖం చూసే అందరూ గ్రహించేస్తారేమోనని భయం వేసింది. ఎలాగైనా అతి ప్రయత్నం మీద మనస్సును తేలిక చేసుకొని, పరిసరాలను మార్చుకోవటం మంచిదిగా తోచింది. అద్దం ముందే ఇదంతా ప్రాక్టీస్ చేస్తూ నిలబడటం అనవసరంగా తోచి, బైటికి వొచ్చాడు.

తన కనుసన్నల్లో మెలిగే డ్రయివర్ కారు తీసుకొచ్చాడు. కార్లో ఎక్కాక "బీచ్"కి అన్నాడు. డ్రైవర్ కు అనుమానం లేసి "ఎక్కడికి సార్?" అన్నాడు.

"బీ—చ్—కి" అన్నాడు ప్రతి అక్షరమూ వొత్తి వొత్తి పెద్దగా పలుకుతూ.

డ్రైవర్ మరింకేమీ మాట్లాడకుండా శరవేగంతో కారును నడపటంలో నిమగ్నుడయ్యాడు.

పట్టణపు వీధుల్లో రెండు వైపులా జరిగిపొయ్యే పెద్ద పెద్ద భవనాలు కానీ, వాన వెలిశాక, మళ్ళీ మొదలు పెడతుందేమోనని భయంతో చకచకా పనులు చేసుకుపొయ్యే మనుషులు కానీ, హడావిడిగా సాగిపొయ్యే కార్లూ బస్సు కానీ మెత్తని కారు కదలికలో సన్నగా హాయిగా శరీరానికి తగిలే చల్లని గాలికానీ సూర్యాన్ని ఆకర్షించ లేదు.

తమాషా—సూర్యం తనను గూర్చికూడా ఆలోచించుకోవటం లేదు. ఆలోచనలన్నీ పూర్తయిపోయినట్లూ, మరి ఆలోచించవలసింది, ఏమీ లేనట్లుగానే, వేడెక్కిన బుర్ర నిద్ర పోసాగింది. సముద్రపు పోటు పూర్తయాక, అటు ఆరంభమైనట్టయింది. చివరకు బీచ్ వొడ్డున కారు ఆగి డ్రైవర్ దిగి తలుపు తీసేదాకా, సూర్యం తనను తాను తెలుసుకోలేక పొయ్యాడు. ఈ ప్రయాణంలో కేవలం ఊపిరి పీలుస్తూ మాత్రమే బ్రతికి వున్నటు అతను ఇప్పుడే గ్రహించాడు.

కారులోంచి దిగి బీచ్ లోకి చూశాడు. ఎవ్వరూ లేరు! సముద్రము మాత్రం హోరుపెడుతూ అలల్ని విసిరి విసిరి వొడ్డుకు కొడుతూ తన విధిని నిర్వర్తిస్తోంది. సిమెంటు బెంచీలమీద మాత్రం నడవలేక, విశ్రాంతి తీసుకుంటున్న వారు కూర్చొని వున్నారు.

సూర్యం తనలో తను నవ్వుకున్నాడు. తనసలు బీచ్ కు ఎందుకు వొచ్చినట్లు? ఎవరైనా చల్లగాలికోసం వొస్తారు; యీ చల్లగాలి మధ్యాహ్నంనుంచే ఆరంభమై కావలసినంత పరిమాణంలో ఎవరి ఇళ్ళ దగ్గర వాళ్ళకే లభ్యమౌతూ వుంటే, పనిగట్టుకొని యింత దూరం యీ సముద్రాన్ని వెతుక్కుంటూ రావలసిన అవసరం ఏముంటుంది? కార్లు వున్నవారు యెవరైనా వొచ్చినా ఆ తడి ఇసుకమీద కూర్చోవటం కష్టమే! ఆ మాటకొస్తే బీచ్ రోడ్డులో కనుచూపు మేర ఆగివున్న కారు తనది ఒక్కడిదే! డ్రైవర్ రెండోసారి ఎక్కడికి అని అడిగింది ఎందుకో సూర్యానికి యిప్పుడు అర్థమైంది.

ఐతే—తను వెంటనే వెనక్కి వెళ్తే చూసేవాళ్లు, కనీసం తన డ్రైవరైనా, తన పొరపాటును గ్రహించి నవ్వుకోవటం తప్పదు. వాతావరణం చాలా ప్రశాంతంగా వుంది; అంతకన్న మార్పు వుండటం చాలా హాయిగానే వుంది... [illegible]; [illegible]; తను బయలుదేరిన పని వేరు. జేబులో చెయ్యి పెట్టుకోగానే చేతికి తగిలే కరెన్సీ నోట్లు హెచ్చరిక ల్ని చేస్తూనే వున్నవి... కాని ఆ వాంఛను తీర్చుకొని మనశ్శాంతిని పొందేందుకు ఒక నిర్మాణ కార్యక్రమం అవసరం. దాన్ని ఆలోచించేందుకు యీ ప్రదేశం అనుకూలంగా వుంది. కనుక తను చేసింది ఎంతమాత్రమూ పొరపాటు కాదనిపించింది సూర్యానికి.

ఎంత ఆలోచించినా తన వొక్కడివల్లా ఏమీ అయేట్లు లేదు. ఆ రకం వ్యవహారంలో అనుభవం లేకపోయినా, దాన్ని గూర్చి తెలిసిన వేరొకవ్యక్తి సహాయం అవసరం. ఆవ్యక్తి ఎవరనేప్రశ్న బయలు దేరింది.

తనకు బాగా తెలిసిన వాళ్లు, తనకు దగ్గరగా వున్నవాళ్లు, డ్రైవర్ ఒక్కడే! ఈ డ్రైవర్ చాలా చోట్ల పని చేశాడు. రెండేళ్లు స్వంత టాక్సీ నడుపుకున్నాడు. వీడికి కాస్తో కూస్తో ఆ రకం కొంపలూ, అక్కడి స్త్రీలూ తప్పకుండా తెలిసి వుండాలి. వీణ్ని అడుగుతే...?

ఏమనుకుంటాడో? వాడు ఏమనుకుంటాడో తనకు తెలియదు.—ఎప్పటికీ! వాడు చాలా సాధారణ విషయంగా తీసుకున్నప్పటికీ, వాడు తనను చాలా చులకన చేసేవాడేమో ననే అనుమానం వేధిస్తూనే వుంటుంది. వీడి ద్వారా మరి కొంతమందికి యీ సంగతి తెలిసినా తెలియవొచ్చు, ఐతే మరి దారి లేదు...లోకమంతా యిది తెలుసే మాత్రం తనకేం నష్టం? నిండా మునగబోతున్న వాడికి చలేమిటి? ఎట్లానూ రాబోయ్యే అవమానానికి తాను సిద్ధంగానే వున్నాడు; అందులో, ఇప్పుడు సంభవించే, ఈ డ్రైవర్‌కు తెలియుట మనే సంఘటన అందులో ఒక చిన్న భాగమే అవుతుంది. తీరా తను నీచుడని లోకానికి తెలిసిపోయే సమయమే దాపురిస్తే, ఇనుప పెట్టెలో దాచిన రివాల్వర్ వుండనే వుంది. దాని సహాయంతో, తను లోకంనుంచి ఎంత సానుభూతినైనా సంపాయించ గలడు. ఆజన్మ విరోధులు కూడా కిక్కురు మనకుండా ఊరుకోవటమో, వీలైతే తన మంచితనాన్ని గూర్చి రెండు మాటలు చెప్పటమో చేస్తారు. ముందు ముందు ఇంత రక్షణను పెట్టుకొని యీ చిన్న చిన్న ప్రమాదాల్ని గూర్చి ఆలోచించటం సుందరానికి చాలా అనవసరంగా తోచింది.

డ్రైవర్ని పిలిచాడు. వాడు వొచ్చి ఎదుట నిలబడ్డాక ఎలా అడగటమా అని మాటలకోసం వెతుక్కో సాగాడు. తన అభిప్రాయాన్ని ఎంతో సున్నితమైన, మాటలద్వారా బైట పెట్టాలనుకున్నాడు.

'చూడు—నీకు ఏమైనా ఇళ్ళు తెలుసా?' అన్నాడు సుందరం, మాటలు తడబడుతూ.

డ్రైవర్‌కు ఏమీ అర్థం కాలేదు. నిజానికి సాయంత్రం కారు తీసుకొని రమ్మన్నప్పటినుంచీ, ఏదో గొప్ప మార్పు యజమానిలో వొచ్చిందనే సంగతి వాడు పసిగట్టక పోలేదు. ఎంత ప్రయత్నించినా అయ్యగారి అభిప్రాయ మేమిటో వాడికి బోధ పడలేదు.

'ఏ ఇల్లు? ఎక్కడి ఇల్లు?' అన్నాడు.

విడమరిచి చెప్పటం సూర్యానికి ఇష్టం లేదు. ఐతే అలా చెప్పకుండా ఉంటానికి వీలులేదు. ఇది తనకు పూర్తిగా కొత్త మేళాం, వాడికి చెప్పటం, వాడిచేత తన అభిప్రాయం తేలిగ్గా గ్రహించేట్లు చెయ్యటం, చాలా కష్టంగా వుంది...

'కాస్సేపు కులాసాగా గడిపే కొంప...ఏ భోగం...' అన్నాడు.

డ్రైవర్ ఆశ్చర్యపోయ్యాడు. తన యజమాని తలకాయలో కూడా ఇలాటి అభిప్రాయాలకు చోటు వుందని తన బుర్ర ఇన్నాళ్ళూ ఆలోచించ లేదు. మొదట అర్థం చేసుకొని, డ్రైవర్ తనలో తను నవ్వుకొని, సమాధానంగా 'వెళ్దాం - గండి' అన్నాడు.

డ్రైవర్ వంకన్నా చూడకుండా సూర్యం కారులో ఎక్కి కూర్చున్నాడు. కారు బయలు దేరింది. యీ మహా పట్టణంలో ఏళ్ళ తరబడిగా వున్నప్పటికీ తనకు తెలియని అనేక రోడ్లూ, తాను వూహించని అనేక కట్టడాలున్నవనే సంగతి, సూర్యానికి ఇప్పుడే అర్థమౌతోంది...వాళ్లు—ఆ వేశ్యలు, ఎక్కడ వుంటారో? వాళ్ళు చేసేది నీచాతి నీచమైన వృత్తి కనుక, బహుశా అశుభ్రమైన వాతావరణం లోనే ఉంటారు...కాదేమో? వాళ్ళ మనసుల్లో ఎంత చీకటి వున్నా, వారికి ఆత్మాభిమానమే లేకున్నప్పటికీ, ఆ నీచాన్నంతట్నీ కప్పి పుచ్చేందుకైనా, పై వాతావరణాన్నీ శరీరపు పై.భాగాల్నీ శుభ్రంగానూ, ఆకర్షణీయంగానూ ఉండేట్లు చేయటం అవసరం; లాభ నష్టాల ప్రశంస లేకుండా, వ్యాపారం జరగాలంటే కాతాదారుల దృష్టిని ఆకర్షించేందుకు చేసే ప్రయత్నాల్లాటివి ఇక్కడకూడా అవసరమేమోననిపించింది!

తను తొందర పడ్డాడేమో? ఏదో ఉద్రేకంలో ఒక పొరపాటు చేసి, ఆ పొరపాటును దిద్దుకోవాలనే ఉద్దేశంతో మరో పొరపాటును చేస్తున్నాడేమో? ఏదైతే తాను కొన్ని సంవత్సరాలుగా ద్వేషిస్తున్నాడో, దానికే ఇప్పుడు తను ఆశించటం హాస్యాస్పదం! కాని 'చెడు' అని తెలిసే మానవుడు చాలా చెడులను చేస్తున్నాడు. అది తన అభివృద్ధి కి హానికరమైనప్పటికీ, ఆ హానిని అనుసరించి వుండే సౌఖ్యం కలిగించే ఆశా విశేషమే ఇందుకు కారణం.

ఇక్కడ తనలో అలాటి 'ఆశ' కన్నా కూడా, తనపైన తనకు కలిగిన అసహ్యాన్ని తగ్గించుకునేందుకు అన్వేషణ ప్రారంభమైంది. అంతే కాదు; పరాభవాగ్నిలో మండిపోయ్యే గుండెకు అమృతం దొరుకుతుందేమోనని వెతక సాగాడు. చివరకు, రాబోయ్యే పరిణామాలతో సైతం సిద్ధమైన తన మొండితనమే తనను యీ దారిన నడిపించ గలుగుతోంది.

ఆలోచనలు తెగక మునుపే కారువేగం తగ్గింది. అప్పటికి కాని సూర్యం పరిస్థితులకు తగిన విధంగా మారేందుకు సిద్ధపడాలని తెలుసుకో లేక పోయాడు. కారు ఒక బంగళా ముందున్న చిన్న తోటలోకి ప్రవేశించింది. సూర్యం నిజంగానే ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే ఇది— యీ ఇల్లు - సంసారులు, కనీసం గౌరవనీయులు ఉండ దగినదిగా వుంటే కాని, తాను వూహించిన నీచవృత్తిని ఏవిధం గానూ స్ఫురింప చేసేదిగా లేదు. ఒక వేళ డ్రైవర్ పొరపాటు పడ్డాడేమో?...అలా ఐవుండేందుకు వీల్లేదు. మృదువుగా అనడం చేతకాక, ముతక భాషలోనే తన వాంఛను తెలియ పరిచాడు. ఇది వ్యభిచార గృహమే ఐతే, ఇందులో ఉండేవాళ్లు నిజంగా దేవ వేశ్యలే ఐవుండాలని పించింది.

కారు పోర్టికోలో ఆగింది.

'లోపలికి వెళ్లి వొస్తాను, మీరు ఇక్కడే వుండండి' అన్నాడు డ్రైవర్ దిగి. సూర్యం తలతిప్పగానే డ్రైవర్ మాయ మయ్యాడు.

రోడ్డుమీద తిరిగే జనానికి తాను కనిపించకుండా ముందున్న చిన్నతోట రక్షణను ఇస్తోంది. అంతకన్న అధికంగా తనలోనే ఎవరో జనం తనను తొంగి తొంగిచూసి భయపెడుతున్నట్లని పించింది. ఏమైతే నేమి, తను గుండెను రాయిచేసుకున్నాడు; యీ భయాలకు అతీతుడననే ధైర్యం తిరిగి తిరిగి పుంజుకుంటున్నాడు...ఇక వీళ్ళందరి కోసమూ తను ఆగవలసిన పనిలేదనే నిశ్చయం గంట క్రితమే ఆరంభమై, ఇప్పటికి కాని ఒక సమగ్ర స్వరూపానికి రాలేదు.

క్షణమొక యుగంగా తోచింది. యీ డ్రైవర్ తనను ఒంటరిగా వొదిలి వెళ్లి ఐదు నిముషాలే ఐనా, తాను రాకూడని స్థలంలోకి రావడం, ఇంతసేపు వుండగలగటం, అసంభవంగానే తోచింది. ధైర్యంచేసి బంగళాలోకి చూశాడు సావిట్లో టేబిల్ మీదవున్న ఫ్లవర్ వాజ్ లో కొత్తగా కోసిన పూలు మాత్రమే కనిపిస్తూన్నవి. ఏది ఏమైనా ఇది అమర్యాదస్తులు వొచ్చే స్థలంగా మాత్రం ఆతనికి తోచలేదు.

డ్రైవర్ కోసం సూర్యం తొందరపడసాగాడు. ఇంతా ఏడుస్తే ఇక్కడ వీలుకాకుంటే తాను చేసిన సాహసమంతా వృథా! ఇంతకు ముందు, కలిగిన డిసప్పాయింట్ మెంట్ కు ఇది కూడా తోడైతే, తగిలిన చోటనే మరో దెబ్బ తగిలి నట్లవుతుంది! ఆందోళనతో అతను కారులో

కూర్చోలేక దిగాడు. కాని ఇంట్లో ప్రవేశించే ధైర్యం లేదు. పోర్టికోలోనే తారట్లాడ సాగాడు. హారన్ కొట్టి డ్రైవర్ని హెచ్చరిద్దామనుకున్నాడు, కాని ఆ హెచ్చరిక ఇంట్లో ఉన్న వాళ్ళందరికీ ఉద్దేశించ బడినట్లవుతుందని వూరుకున్నాడు. ఎటూ తోచక కారుదగ్గర్నే అటూ ఇటూ తచ్చాడ సాగాడు.

డ్రైవర్ ఎలాంటి వార్తను మోసుకొచ్చాడోనని సూర్యం ఆత్రుతగా అతని కేసి చూచాడు.

'లోపలికి రండి—' అన్నాడు డ్రైవర్.

సూర్యం మాట్లాడకుండా డ్రైవర్ని అనుసరించాడు. రెండు మూడు గదుల్ని దాటాక, పడకగది వొచ్చింది. అక్కడ సోఫాను చూపి డ్రైవర్ మాయమయ్యాడు.

సూర్యం సోఫాలో కూర్చొని గది నంతట్నీ పరిశీలించాడు. ఐశ్వర్యవంతుల ఇంటిలో ఉండదగిన ఫర్నిచరంతా వుంది. బహుశా యీమె యీ వేశ్య; వ్యాపారంలో బాగా సంపాయించి ఉండొచ్చనుకున్నాడు. వాతావరణం మాత్రం ఏవిధంగానూ ఏవగించుకో నిచ్చేట్లుగా లేదు: పైపెచ్చు చూస్తున్న కొద్దీ జీవితంలో తనకు వెలితిగా కనిపించేదేదో ఇప్పుడే తెలుసుకున్నట్లూ, దాన్ని సాధించే మార్గంకూడా చేతికి అందుబాటులోనే ఉన్నట్లూ తోచింది.

మళ్ళీ భరించరాని ఒంటరితనం ప్రారంభమైంది. ఏదో కొత్త చోటులో ఉన్నప్పుడు కలిగేలాంటి ఇబ్బందిని ఫీల్ కా సాగాడు. కాని పోర్టికోలో వలె ఇక్కడ ఇటూ అటూ పచారు చేసేందుకు అతను సాహసించ లేదు. ఎంతకూ ఆత్రుతతో వేచివుండటం, నిలకడలేని మనస్సుపడే ఆరాటం ప్రతి అంగమూ రాబొయ్యే సంఘటనకు సిద్ధంగా శక్తి వంచన లేకుండా నిర్వర్తించ వలసిన విధులకు ఎదురు చూస్తూండటమూ, అతన్ని అన్ని వైపుల నుంచీ పిండి వేస్తున్నయ్.

త్వరలోనే అతని ఒంటరితనం భగ్నమైంది. కళ్ళముందు తళుక్కున మెరిసే మెరుపు తీగల్లే, ఒక జవ్వని గదిలో ప్రవేశించింది. ఆ విద్యుత్ కాంతికి గదిలో వెలిగే వందవోల్టుల బల్బుతో పాటు, అతని దృష్టి కూడా మొక్కవోయి నట్లయింది. ఇది కారణంగానే కళ్లు ఎంత తొందరపడినా ఆమె రూపురేఖా విలాసాలను పరిశీలించ లేక పోయినవి.

చప్పున కళ్ళు మూసుకున్నాడు, మళ్ళీ తెరిచాడు. యీ కొత్త కాంతికి క్రమంగా కళ్ళు అలవాటు పడినయ్.

ఆమె విలాసంగా టేబిల్ మీద ఆనుకొని, అతనికి నమస్కరించింది...తన ముఖ్కూ మొహం క్రితం క్షణం వరకూ ఎరుగని యీ యువతి, తనకు నమస్కరించటాన్ని మొదట సుందరం నమ్మలేక పోయ్యాడు. ఒకానొక అపరిచితుడికి, తాహతుతో పని లేకుండానే, కేవలం తన ఇంటికి వొచ్చిన గౌరవనీయుడైన అతిథిని సత్కరించేందు కన్నట్లు ఆమె నమస్కరించింది. తను ఎలాంటి వాడైనప్పటికీ, తన విలువను గ్రహించగలిగే యీ స్థలాన్ని తను ఎన్నటికీ మరిచిపోలేదేమో?

ఆశ్చర్యంతో మూగపోవటం వల్ల, ప్రతి నమస్కారం చేయ వలసిన బాధ్యతను సైతం అతను మరిచి పొయ్యాడు; ఆ సంగతి గ్రహించేటప్పటికే ఆలస్యం కావటంవల్ల, తను చేసిన పొరపాటును ఎత్తి చూపి నట్లు ఉండకుండా ఉండేందుకని, విధిగా మళ్ళీ నమస్కరించటాన్ని కానీ, ఆమె చేసిన నమస్కారాన్ని పాటించినట్లు కానీ, పోంగకుండా తెలివిగా ఊరుకున్నాడు.

తరువాతి కార్యక్రమం అగమ్య గోచరంగా తోచింది. ఇక్కడికి వొచ్చేవాళ్ళు ఎలా ప్రవర్తించాలో, ఎలా మాట్లాడాలో తనకు బొత్తిగా తెలియదు. ఏం మాట్లాడితే ఏం తప్పో? తనకు ఇచ్చిన ఆధిక్యత, తనపట్ల ఆమె చూపిన గౌరవం, ఏం దెబ్బ తింటుందో? చివరకు తన మాటల్లోనే ఆమె తనను బుద్ధిహీనుడనో, కనీసం మూర్ఖుడనో, లేక అమాయకుడనో గ్రహించేస్తుందేమో? అందుకని మాట్లాడకుండా వూరు కోవటం నిజంగానే తన తెలివి తక్కువను బైట పెడుతుంది...అసలు ఇంతగా ఆలోచించుకోవటం వల్లనే, ప్రతీ చిన్న సమస్యా విశ్వరూపాన్ని దాల్చి ఎటూ తేలకుండా తన తలలోనే గూడు కట్టుకొని ఆ బరువును తను భరించ లేకుండా చేస్తూంది. కేవలం తన గొప్పతనాన్ని, లేదా సుగుణ పరంపరను, దేన్నయితే నేమి—మెచ్చుకునేందుకు, తనను యీ ప్రపంచ బాధలనుంచి కొద్దిసేపు వేరు చేసేందుకుగాను, యీమె ప్రత్యక్షమైంది. ఏమైనా ఆమె తన కన్న తక్కువది, కనుక తన ప్రవర్తనను గూర్చి ఎక్కువ ఆలోచించటం అవసరం. తన కొరకు వొచ్చిన

స్త్రీని ఏవిధంగా గౌరవించాలో, ఆమెతో ఎలా మాట్లాడాలో అదే తను దృష్టిలో ఉంచుకోవాల్సిన ముఖ్య విషయం!

తన వొంతు మాట్లాడటం ఐపోయినట్లూ, తరువాతి సంభాషణా క్రమం కోసం వేచి వున్నట్లుగా ఆమె తలవొంచుకొని, బొటన వేలు నేలరాస్తూ, అప్పుడప్పుడు సూర్యం వంక క్రీగంటచూస్తూ, అతను మాట్లాడటానికై ఎదురు చూస్తున్నట్లుగా ఆమె ఉన్నది.

'నీ పేరేమిటీ?' అన్నాడు, వినపడీ వినపడకుండా...

ఆమెకు సరిగా వినిపించక పోయినా పెదవుల కదలికను బట్టే అతని ప్రశ్నను గ్రహించింది.

'సత్యవతి' అందామె మృదువుగా.

సూర్యం అదిరి పొయ్యాడు. ఏ పేరంటే తాను ఇన్నాళ్ళూ చెవి కోసుకునే వాడో, ఆ పేరంటేనే ఒక రకమైన భయం రెండు గంటల క్రితమే తన అనుభవంలోకి వచ్చింది. మళ్ళీ అదే పేరు ఇక్కడ వినిపించింది. ఆ సత్యవతి తనకు దూరమైనప్పటికీ, అదే పేరుగల యీమె తనకు లభ్యమయే అవకాశాలన్నీ చేతులోనే ఉండటంవల్ల, అతని ఆతృత హెచ్చింది. ఇందాకట్నుంచీ ఆమె ఏమైనా అనుకుంటుం దేమోననే, పరీక్షగా చూడలేదు. ఇక ఇప్పుడు ఆమెను పరిశీలించి చూడటమూ, తన ఆశల్ని నాశనం చేసిన ఆ సత్యవతితో పోల్చి చూడటమూ అవసరమనిపించింది.

మొదటి చూపులోనే అతను అనుకున్నాడు; యీమెను చూసి వేశ్య అనుకో గలిగిన సాహసం ఎవరి కుంటుందీ అని! సంసార స్త్రీలో ఉండవలసిన సౌమ్య లక్షణాల కన్న, ఎక్కువగా యీమెలో అవి తనకు స్ఫుటంగా కనిపిస్తున్నవి. ఆశ్చర్యం! పేరులోనే కాకుండా, ఇంకా అనేక విషయాల్లో సైతం యీమె ఆ సత్యవతిని ముమ్మూర్తులా పోలివుంది.

సన్నగా పొడుగ్గా నాజూగ్గా వుందీమె; ఆమె గూడా అంతే! ముఖమూ, కనుముక్కు తీరుకూడా ఆ సత్యవతినే పోలివుంది. విశేషించి చెవులను కప్పే ఆమె జుట్టు, ఈ పోలికను మరింత బలపరుస్తూ వుంది. వయస్సులో నేమి, ఒడ్డు పొడుగులో నేమి, హావభావ విలాసాదుల్లో నేమి, యవ్వన శోభలో నేమి యీమె ఆ సత్యవతికి చాలా దగ్గరగా వుంది. మొత్తం మీద చూస్తే ఆ సత్యవతి కన్న, యీ సత్యవతే ఎన్నికో

దగ్గర! యీ పోలికలు ఇంత ఎక్కువగా ఉండటం కేవలం ప్రమాదా త్తూ కాకపోవచ్చు. ఏదైతే తనకు అందుబాటులో లేకుండా దూసుకొని పోయిందో, దేని ప్రత్యామ్నాయం కోసం తాను వెతుక్కుంటూ వొచ్చాడో, ఆ దొరికిన దానితోనే తృప్తిపడే ప్రయత్నం జరిగింది. ఎప్పుడు కోరేది దొరకదో, దొరికిన దానిమీద కోర్కెను కేంద్రీకరించుకొని తృప్తిపడటం సహజమేనేమో! అయితే ఇది అతనికి తెలియకుండానే జరిగి వుండొచ్చు.

ఆమె చూపులతోనే తనను కవ్విస్తోంది, తనను ఆకర్షించి, లాలించి, వేరొక ప్రపంచంలోకి లాక్కుపొయ్యేందుకు సిద్ధంగావుంది. కానీ తాను మాత్రం తన ఆలోచనల్లో లీనమైపోయి ఉండటం వల్ల, ఇంతసేపు ఆమెను తగిన విధంగా గౌరవించలేక పొయ్యాడు. ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు... సరిగ్గా తన శోభనపు రాత్రి అతనికి గుర్తొచ్చింది.

సూర్యం సర్వశక్తుల్నీ కూడదీసుకున్నాడు; లేచి వెళ్ళి ఆమెను సమీపించాడు. తను దగ్గరవుతూన్న కొద్దీ, ఆమె సిగ్గుతో వాలిపో సాగింది. అది సహజమైన సిగ్గయినా, లేక కేవలం నటనైనా యీ స్థితిలో తనకు ఒకటిగానే తోస్తుంది; ఏది ఏమిటనే విచక్షణ కాని, తర్కం కానీ అనవసరం; అంత తీరిక కూడా లేనట్లే తోస్తుంది. ఒక రకం మైకంలో పడిపొయ్యాక, మనస్సు కూడా పదునుగా పని చేయదేమో?

ఏమో—యీమె, తన బానిసే నన్నట్లు తోచింది. తనకోసమే ఎదురుచూస్తూ కాలం వెళ్ళబుచ్చినట్లూ, యీనాటి తన సాక్షాత్కారమే తనకు పదివేలన్నట్లూ, నిండు హృదయంతో అహ్వానించి, పూజించేందుకు సిద్ధంగా వున్నట్లూ, సుందరానికి తోచింది; శ్రీరామ సాక్షాత్కార సమయంలో అహల్య పొందిన మనోభావాల చిత్రీకరణకు యీ సత్యవతిని ఒక మోడల్‌గా తీసుకోవొచ్చు ననిపించింది. నిజానికి యీమె తనకు అపరిచితురాలే ఐనప్పటికి, యీ జన్మ కాదు—జన్మజన్మాల స్నేహబంధం తమ మధ్య వున్నంత అప్యాయతను కనబరుస్తోంది. బతికవుండే స్వర్గంలోకి తను ప్రవేశించ లేదు గదా!

మృదువుగా, మృదువైన ఆమె చేతిని పట్టుకున్నాడు. ఒక విద్యుత్ ప్రవాహమేదో తనలో ప్రవేశించి నట్లయింది. ఆమె కొద్దిగా కదిలింది.

'అక్కడ కూర్చుందామా?' అన్నాడు.

జవాబుగా ఆమె తల ఆడించింది.

ఆమె సిగ్గును కాపాడుతూ, జాగ్రత్తగా నడిపించుకొని వొచ్చి సోఫాలో తన పక్కన కూర్చోబెట్టుకున్నాడు. సభ్యతకు విరుద్ధమైనప్పటికీ ప్రాణ సహితంగా వున్న యీ సుందరిని వాడిగా, వేడిగా పరిశీలనగా చూడాలనే వాంఛను తొక్కిపట్టుకో లేక పోయ్యాడు. ఆమె ఇదంతా కనిపెట్టి గర్వంగా, ఠీవిగా నవ్వింది. టాకీలు వొచ్చిన కాలంలో మూకీల ప్రాధాన్యత తగ్గవలసిన అవసరాన్ని సూర్యం గ్రహించక పోలేదు.

'సత్యవతీ!' అన్నాడు.

'ఆఁ' అని ముహం ఎత్తి అతనిచ్చే ఆజ్ఞ కోసం ఎదురు చూస్తున్నట్లుగా అతని కళ్ళల్లోకి చూసింది.

'మా ఇంటికి వెళ్దామా?'

'ఇప్పుడా?' అని వెంటనే 'అలాగే' అంది.

తనంటే ఎంత అభిమానం! ఎంత నమ్మకం! తనెవరో, తను ఎలాటివాడో, తను ఆమె పట్ల ఎలా ప్రవర్తిస్తాడో ఆమెకేమీ తెలియదు; తన ఇల్లు ఎలా వుంటుందో, అక్కడ కలిగే ఇబ్బందులేమిటో, ఆ కొత్త ప్రదేశంలో తన కేమైనా ప్రమాదం కలుగుతుందో, స్థానబలిమి లేని అపరిచిత ప్రదేశంలోకి వెళ్ళేముందు ఆలోచించవలసిన అవసరం వుందో లేదో కూడా ఆమెకు తెలియదు. పరిచయమైన కొద్ది నిమిషాల్లోనే తన నమ్మకాన్ని, తన విశ్వాసాన్ని, తన జీవిత సర్వస్వాన్ని అర్పించేందుకే సిద్ధమైంది. తను కావాలనుకుంటున్న స్త్రీ యీమే నన్న నమ్మకం గాఢంగా నాటుకు పోయేట్లు చేసింది సత్యవతి.

నిజానికి ఇక్కడ తనకేమీ తక్కువై కాదు, తన ఇంటికి వెళ్దామనుకున్నది. ఆమె ఏమంటుందో నని అలా అన్నాడు; బహుశా అందుకామె అభ్యంతరం చెపుతుందని అనుకున్నాడు. ఆమె తను సిద్ధమేనని చెప్పాక, ఆమెను వెంటతీసుకొని వెళ్ళకపోతే ఏం బావుంటుంది? తన ఇంటికి వెళ్ళటం, తన కెంతో స్వేచ్ఛను కూరుస్తుంది! తను సత్యవతి మీద అలిగి, ఆ అలకను సమాజానికి వరింప జేశాడు. అ సమాజానికే

తెలిసేట్లు చేయటం, తన ధైర్య సాహసాల్ని ప్రదర్శించి సమాజపు మొహంలో గర్వంగా, తృప్తిగా నవ్వటం అత్యవసరం; అంతవరకూ తనకు మనశ్శాంతి ఉండదు. అందుకు యీ సత్యవతి సరైన ఆయుధమే ననేందుకు సందేహం లేదు.

సూర్యం లేచి నిలబడ్డాడు; ముందు వెనకలు ఆలోచించకుండా ఆమె కూడా సూర్యాన్ని అనుసరించింది. ఇద్దరూ కారులో ఎక్కారు.

'ఇంటికి' అన్నాడు సూర్యం.

కారు బయలు దేరింది. దారిలో ఎవ్వరూ మాట్లాడ లేదు. ఒకరి కొకరు సంబంధమే లేనట్లు, ఎవరి ఆలోచనల్లో వారు మునిగి తేలుతున్నారు. చివరకు బంగళాలోకి కారు వొచ్చి ఆగాక, సూర్యం ఆమెను వెంట పెట్టుకొని ఇంట్లోకి వెళ్ళాడు.

తన పక్కనే వున్న సుందరాంగి తనదేననే తలంపు వొచ్చినప్పుడల్లా, సూర్యం వొళ్ళు పులకరించ సాగింది. జీవితంలో తాను ఊహించనంత అదృష్టం ఒక్కసారిగా వొచ్చి పడి నట్లనిపించింది. ఆ తన్మయతలోనే బంగళా చేరేదాకా అతనేమీ మాట్లాడలేక పోయ్యాడు.

క్రమంగా ఆ అబ్బిన అదృష్టానికి అలవాటయ్యాడు. ఇప్పుడు ఒక రకం గర్వం అతన్ని ఆవరించింది. యీమె పక్కన వుండగా, యీ లోకానికి భయపడటం కాదు; ఇలాటి నాలుగు లోకాల తాకిడినికూడా తట్టుకో గలిగిన కొత్త శక్తి తనకు వొచ్చి పడినట్లయింది. లోకమంటే యీమె మినహా మరెవ్వరూ లేరనే మైకం అతన్ని కమ్మింది. యీ విధంగా తన అధికృత ఎంతగానో పెరిగిన ట్లనిపించింది; ఇదే వేరొక రూపంలో ఇతరుల అల్పత్వాన్ని సూర్యం చేత గుర్తింప జేసింది కూడా.

ఆమెను వెంట పెట్టుకుని తన ఇల్లంతా చూపాడు. ప్రతి గదీ తిప్పుతూ 'ఎలా వుం'దని అడుగుతూ, ఆమె అభిప్రాయాలను తెలుసుకో సాగాడు. ఆమె విలువను తన దృష్టిలో పెంచుకుంటూన్న కొద్దీ, అదే మేరకు తన విలువ కూడా దానంతటదే పెరగ బొచ్చింది.

• వంటవాడూ, ఇద్దరు నౌకరులూ యీ కొత్త మనిషిని చూశారు. మానవ మాత్రుడైన వాడు ఎవడైనా చేసే పనే అన్నంత సులువుగా వాళ్లు అభిప్రాయ పడ్డారు. యజమాని చేసిన పనిని విమర్శించే హక్కు వాళ్ళకు లేకపోవచ్చు; వాళ్ళ అభిప్రాయాలను ఎవ్వరూ పాటించరు సరికదా, ఆ అనవసరపు అభిప్రాయాలే వాళ్ళను పనిలోనుంచి విరమించుకోవాల్సిన స్థితిని స్వయం ఏర్పరుచుతవి. కాని వాళ్ళల్లో వాళ్ళు, వాళ్ళ దృష్టికి ఏ దేలా కనిపిస్తూ వుందో చెప్పుకునే వాళ్ళు. ఈ సారి మాత్రం అందుకు గూడా వారు సాహసించ లేదు. ఎందుకంటే వాళ్ళ దృష్టికి ఇది చాలా స్వల్పమైన, సామాన్యమైన సంఘటన! పైపెచ్చు 'అయ్యగారి' సహజత్వ మేమిటో ఇప్పుడు స్పష్టంగా బైటపడింది...

అయ్యగారితో వొచ్చిన అమ్మగారి మీద కూడా వాళ్ళకు వెంటనే భక్తి శ్రద్ధలు కలిగినవి. ఇంటి హోదాకేమీ, వంశ గౌరవ మర్యాదల కేమీ, అయ్యగారి అంతస్తుకేమీ—అన్నిటికీ తగిన స్త్రీయే యీ నాడు వొచ్చినందుకు, అలాంటి స్త్రీనే తెచ్చినందుకూ, ఒక విధంగా అయ్యగార్ని వాళ్ళు అభినందించారు. ఈమె ఒక కొత్త వ్యక్తిగా వాళ్ళకు కనిపించటం లేదు. సంవత్సరాల పరబడిగా యీ యింట్లో తిరుగుతూ, తమ సేవలను పొందుతూన్నట్లు గానే వాళ్ళకు తోచింది. సరిగ్గా సూర్యం కూడా అతి త్వరలోనే, ఈలాటి అభిప్రాయానికే లొంగి పొయ్యాడనేది వాళ్ళకు తెలియదు.

ఆమె ఇంట్లో తిరుగుతూ వుంటే గృహలక్ష్మి కనిపించింది సూర్యానికి. వ్యభిచారిణి అనే నీచాభిప్రాయమే అతనికి రాలేదు. తనను ఉద్ధరించేందుకు భూమి మీదికి దిగిన దేవకన్యే కనిపించింది.

చివరకు పడక గదిలోకి తీసుకొని వెళ్ళాడు. అక్కడామె సోఫాలో వయ్యారంగా కూలబడింది. యీ ప్రదేశమంతా ఆమెకు పరాయి చోటుగా వుంటుందేమోనని సూర్యం తల పోశాడు. కాని ఆమె మాత్రం యీ ఇల్లు తనదే నన్నట్లుగా ప్రవర్తించ సాగింది.

'భోజనం చేద్దామా?' అన్నాడు సూర్యం. మొదట్లో అతనిలో ప్రవేశించిన బెరుకు, ఏదో తప్పిదం చేస్తున్నాననే బాధ, మొదలైనవన్నీ ఎట్లా మాయమైనవో తెలియదు. బహుశా ఆమె ప్రవర్తనే, తన ప్రవర్తన మారేందుకు పెద్ద కారణమై ఉండొచ్చు. తనను ఆమె ఎంత

గానో ఎరుగున్నట్లు ప్రవర్తించ సాగాక, ఆమె కూడా తనకు బాగా తెలిసిన వ్యక్తి అనిపించింది!

'మీ ఇష్టం—' అందామె.

ఆమెకు ప్రత్యేకమైన అభిప్రాయాలు లేవు; ఒకవేళ వున్నా, వాటిని ఆమె ఇంటి దగ్గరే విడిచేసి వొచ్చింది. తన అభిప్రాయాలతో సరిపెట్టుకో గల కొత్తశక్తి, తన ఇష్టాయిష్టాలనే తనవిగా భావించి తనను రంజింప చేయగల చాకచక్యం, తననుంచి వేరు వ్యక్తిని కాదని రూఢిగా రుజూ చేయగల కళానైపుణ్యం, మొదలైనవన్నీ యీ సత్యవతిలో అడుగడుగునా ప్రతిఫలిస్తునే వున్నవి.

ఐతే ఇందువల్ల ఒక చిన్న ఇబ్బంది లేకపోలేదు. ఉదాహరణకు తనకు ఆకలైతే, ఆమెకు ఆకలి కానప్పుడు ఆమె దాన్ని లెక్క చెయ్యకుండానే తన పంక్తిని కూర్చోగలదు. కాని తనకు ఆకలవక ఆమెకు ఆకలైనట్లయితే అప్పుడామె ఆ బాధను భరిస్తుంది; కాని బాధను భరిస్తూన్నట్లు తను గ్రహించే అవకాశం లేకుండా వుండేందుకై విశ్వ ప్రయత్నం చేస్తుంది. అలాటి ప్రయత్నాల్లో ఆమె తప్పక విజయాన్ని సాధించ గలదు కూడాను. ఎందుకంటే అలాటి అనేక ఇతర ప్రయత్నాల పునాది మీదనే ఆమె తాత్కాలిక భార్యాత్వాన్ని వహించ గలగటం, తాత్కాలిక భర్తకు; తనను మరవలేనంతగా సంతృప్తి నివ్వ గలగటం జరుగుతోంది!

'నీకు ఆకలవుతూందా?' అన్నాడు సూర్యం. కాస్త అనుమానం వెంబడించటం వల్ల.

ఆమె తెలివిగా 'మీకో—?' అంది.

'నా సంగతి అటుంచు...నీ సంగతి చెప్పుమా—!'

తనకు ప్రత్యేకమైన 'సంగతి' వొకటి వుందనే అభిప్రాయాన్ని రద్దు పరిచేందుకు 'మీ సంగతే—నా సంగతీనూ—' అంది నవ్వి.

సంభాషణ అనుమానాల్ని తీర్చలేనిదైంది; కాని అనుమానాన్ని పెంచనందుకు సంతోషంగానే వుంది. సూర్యం గడియారం వంక చూశాడు. ఏడున్నరే ఐంది. మామూలుగా మరో గంటయితేనే కాని భోజనాలు జరగవు. ఆ మామూలుకు భిన్నమెందు కనుకున్నాడు సూర్యం. ఈ గంటలోనూ ఆమెను తనకు ఇంకా దగ్గర చేసుకోవొచ్చు.

'పోనీ ఒక గంటాగి భోంచేద్దాం' అన్నాడు.

'అలాగే... నాకూ అదే ఇష్టం'

'ఈ లోగా కాస్త కాఫీ తాగుదామా?'

'మీ ఇష్టం—'

గంట వాయించాడు. నౌకరు రాగానే కాఫీ తెమ్మని చెప్పాడు. మరో ఐదు నిమిషాల్లో కెటికల్‌తో కాఫీ వొచ్చింది; మామూలుగా ఐతే కప్పుల్లోనే వచ్చేది. కాఫీ తెచ్చిన నౌకరు వెంటనే వెళ్ళిపోయాడు.

ఆమె తన కర్తవ్యాన్ని వెంటనే గ్రహించింది. ఆమె కాఫీని కప్పుల్లోకి పోసి, మొదటి కప్పును సూర్యానికి అందించింది. తనను సౌఖ్య పెట్టటమే యీమె ఆశయం కాబోలు! ఆ సౌఖ్య పెట్టే పద్ధతు లన్నీ అపరిచితుడైన తన పట్లకూడా గురి తప్పకుండా ఆమలు జరప గలదు! ఆమెను చూస్తూనే కాఫీ చప్పరించాడు. కాఫీకి స్వతహాగా లేని రుచి ఏదో వొచ్చి పడినట్లయింది. మనసు ఆనందంతో నిండినప్పుడు అనుభవంలోకి వొచ్చే ప్రతిదీ సంతోష పెట్టగలుగుతూనే వుంటుందేమో!

ఖాళీ కప్పుల్ని టేబిల్ మీద పెట్టాక, సూర్యానికి తన కర్తవ్యం తెలిసి వొచ్చింది. అతిథిగా వొచ్చినామెను, తను లెక్క చేయనట్లుగా తన తలంపుల్లో కరిక గావం జరుగుతోంది. ఆ పొరపాటు మరి జరగకుండా, ఆమెకు నిజంగానే తను కొత్తవాడు కాదని నిరూపించాల్సిన సమయం ఇంకా దాటిపోలేదని గ్రహించ గలిగాడు.

సౌజ్ఞ చేసి పిలిచాడు; ఆమె వెంటనే వొచ్చి తన పక్కనే కూర్చుంది. తను మాట్లాడాలనే సంగతిని సూచన ప్రాయంగా అతని కళ్లలోకి చూస్తూ ఆమె హెచ్చరించింది. కాని పెన్నిధి వొళ్ళో పడ్డప్పుడు, నోరు కదపలేని అశక్తతలాంటి దానికి సూర్యం లొంగిపొయ్యాడు. ఆమెను ఇంత దగ్గరగా ఉంచి చూస్తూ, ఆమె సౌందర్య విలాసాదుల్ని ఆస్వాదిస్తున్నాడే గానీ, పెదవి కదపలేక పోయాడు.

అతని అవస్థను ఆమె గ్రహించింది. తనను గుచ్చిగుచ్చి చూస్తున్నప్పటికీ ఆమెకు బాధ కలగలేదు; కాని, తను అతని వైపు చూడనట్లయితే అతనేమి చేస్తున్నాడో తెలియదు. ఐతే తనలా చూడటం అతనికి ఇబ్బందిగానే వుంటుంది; ఒక రకంగా తనకూ ఇబ్బందే కదా!

'ఏమిటలా చూస్తారు?' అంది, అతని కళ్ళలోకి సూటిగా చూస్తూ, మృదువుగా వయ్యారంగా అతన్ని తాకుతూ.

సూర్యం చప్పున తేరుకున్నాడు. తన అవస్థ ఆమెకు అర్థమయ్యేట్లుగా చెప్పాలని ప్రయత్నించాడు.

'ఏం లేదు...ఇలా పరాయి ఆడదానితో గడపటం నాకు ఇదే మొదటిసారి...అందుకని—' డొంక తిరుగుడు లేకుండా, తన అమాయకత్వమంతా ఉట్టి పడేట్లుగా చెప్పాడు సుందరం.

'ఉహుఁ. యీ కొత్తదనం మీకు బాధగా వుందికదూ?'

'బాధ కాదు...అంటే నేనేదో నేరం చేస్తున్నాననే, అనుమానాలాంటివేవీ వేధించటం లేదు...కాని—'అని ఓ క్షణం ఆగి అన్నాడు. 'నిజం చెప్పనా?'

'అబద్ధాలు కూడా చెప్తూంటారా?'

'ఎంత తెలివిగా మాట్లాడింది!' అనుకున్నాడు. సంస్కారం తక్కువేమో ననుకో నక్కర్లేకుండా, ఆమె అర్థమౌతూన్న కొద్దీ ఆమె మీది గౌరవం కూడా చక్రవడ్డీ లాగు పెరుగుతూనే ఉంది.

'అబద్ధం చెప్పాలని వున్నా, నిన్ను చూస్తే అబద్ధమాడ బుద్ధి కాదు' అన్నాడు ఆలోచించి.

'ఔను...నా మొహంలో సత్య హరిశ్చంద్రుని కళలన్నీ వేళ్లాడుతూన్నవి...ఔనా?' అందామె నవ్వుతూ.

చాలా సేపటినుంచి తనతో పాటే, ఆమె కూడా మౌనంగా వినయంగా ఉంటూ వొచ్చింది; అందుకని ఆమె మాటకారి కాదు లెమ్మనుకున్నాడు. ఇప్పుడు—వాతావరణాన్ని పూర్తిగా అర్థం చేసుకున్నాక, ఆమె మాటల ధోరణి చూస్తూంటే - యీమెతో తనేం మాట్లాడగలడని పిస్తోంది. సంభాషణ సాగించినకొద్దీ తన చేతకానితనం, జవాబు తూకంగా చెప్పలేని అసమర్థత, బైట పడుతూంటవి కనుక, నీళ్లు నములుతూ ఆలోచనలో పడ్డాడు.

యీ అవస్థను ఆమె వెంటనే గ్రహించింది. సూర్యం మొహాన్ని సున్నితంగా తన వైపు తిప్పుకుంటూ 'కోపం వొచ్చిందా?' అంది.

తన పట్ల ఇంత జాలిపడే జీవి వున్నదని తెలుసుకోగానే జీవిత మాధుర్యం తాలూకు, మరచిన రుచి తిరిగి అనుభవంలోకి రాసాగింది.

నవ్వుతూ 'లేదు...కోపం లేదు...నేను చెప్పదల్చుకుంది, ఎలా చెప్పాలో తెలియక—' అన్నాడు.

'చెప్పండి. చేతనైనంతవరకు చెప్పండి. మన అనుభూతు లన్నిటినీ మాటల్లో చెప్పలేం కదా! ఐనా ఏదోరకంగా చెప్పెయ్యండి. నేను అర్థం చేసుకోగల ననుకుంటాను—' అని ఆమె అతని ఫాలభాగాన్ని సున్నితంగా వేళ్ళతో స్పృశించి, వీపుమీద మృదువుగా చేతితో రాచింది.

అనురాగ పూరిత మైన యీ లాలన అతనికి కొంత శక్తిని ఇచ్చింది. తన లోపాలకు ఆమె నవ్వదు; ఎగతాళి చెయ్యదు - సరికదా, ఎంతో సానుభూతితో చూస్తుంది. తన బలహీనతల్ని తనకు అనుకూలంగా మార్చుకునే ప్రయత్నం ఆమెవల్ల కానిపని. పై పెచ్చు ఆ లోపాలను తనకు చేతనైనంతగా పూరించి, ఉభయులూ ఒకే స్థాయికి రాదగిన అవకాశాల్ని కల్పించ గలదు! తనకు నచ్చిన స్త్రీ, ఆదర్శప్రాయమైన వనితను గురించి అంతకు పూర్వం, అతనికి లీలగా ఒక అభిప్రాయం వుండేది. యీమెతో పరిచయమైన కొద్ది సేపట్లోనే ఆ స్త్రీ ఎలా ఉండాలో నిర్ధారణగా తెలుసుకోవటమే కాదు; ఆమెనే పొందగలగటం కూడా జరిగింది; ఇంతకుమించి తన వూహ పైకి పోదు; పోనక్కర్లేదు.

'ఏం లేదు...నా ప్రవర్తన సకు ఎలా వుంటుందోనని ఆలోచిస్తున్నాను—'

'ఏ—ఎలా వుంటుందనీ?'

'ఏమో నాకెలా తెలుస్తుంది?'

'మీరు నిజంగా అమాయకులే! మీ అమాయకత్వాన్ని గుర్తించలేనంత అమాయకత్వం మీలో వుంది. నేను మిమ్మల్ని ఎలా అర్థం చేసుకుంటున్నానో కనీసం నా ప్రవర్తన చెప్పటం లేదా? అసలు అమాయకుల మీద నాకు చాలా అభిమానం...' అందామె.

'ఎందుకనీ?' అన్నాడు, అర్థంగాక.

'మనం పిల్లలమీద ఎందుకు జాలి పడతాం? వాళ్ళు అశక్తులనీ, అమాయకులనీ కదా! యీ కారణం వల్లనే మీరంటే నాకు అభిమానం ఏర్పడింది!' అన్నదామె.

తన చిన్నతనాన్ని ఆమె గుర్తించింది; ఇదీ ఒకందుకు మంచిదే నేమో? ఎందుకంటే ఆమె దృష్టిలో తను ఎంత అమాయకుడైతే, తన

పట్ల ఆమె అభిమానం అంతగా పెరుగుతుంది. కనుక కావాలని కొంత అమాయకత్వాన్ని నటించి నప్పటికీ అది తనకే మేలు చేకూరుస్తుంది.

యీ వింత జీవిని గూర్చి అనేక విషయాలు - ఆమె జీవిత ఘట్టాలెన్నిటినో తెలుసుకోవాలనే కుతూహలం అతనికి కలిగింది. ఒక వ్యక్తి పట్ల అభిమానం, ఇష్టత కలగ నారంభించాక, ఆ వ్యక్తిని గూర్చి ఇంకా తెలుసుకోవాలనే వాంఛ ప్రబలం కావటం సహజమే గదా!

'నీ జీవితాన్ని గూర్చి వినాలని వుంది—' అన్నాడు.

ఆమె నవ్వింది; ఆనందమేమీ లేదు. సమయానికి ఊతపదం వాడినట్లుగా, ఆమె ఆ నవ్వును వాడింది.

'అదంతా పోనిద్దురూ...అంత తెలుసుకో దగ్గ ఘట్టాలేవీ నా జీవితంలో లేవు. అదీగాక యీ రాత్రి మీకు ఎంతో హాయిగా గడవాల్సి వుంది. నేను నా కర్తవ్యాన్ని నిర్వహించటంలో పడాల్సిన జాగ్రత్తల్ని గూర్చే ఆలోచిస్తున్నాను—' అంది.

కర్తవ్యంపట్ల ఆమె చూపిన ప్రాముఖ్యతను మెచ్చుకున్నాడు. ఎందుకంటే ఆమె కర్తవ్య నిర్వహణే వేరొక రూపంలో తానుపొందే ఆనందం...అయితే జీవిత విశేషాలు అడిగి ఆమెకు బాధ కలిగించానేమోననే అనుమానం అతనికి కలిగింది.

'నీ జీవితంలో విషాదం ఎక్కువ...అందుకే దాన్ని జ్ఞాపకం చేసుకునేందుకూ, నాకు చెప్పి, నా మనస్సును కూడా పాడు చేసేందుకూ నీకు మనస్కరించటం లేదు—ఔనా?' అన్నాడు సుందరం.

'సరిగ్గా అలా అనికాదు. స్థూలంగా ఆలోచిస్తే జీవితం ఏముందీ? కొన్ని కష్టాలూ, వాటిని అంటుకొనే మరికొన్ని సుఖాలూ; కష్టాలను తెచ్చుకునేందుకు మనమేమీ ప్రయత్నం చేయనక్కర్లేదు - ఎందుకంటే అవి వాటంతటవే వొస్తవి. పోతే సుఖాన్ని పొందేందుకే ప్రతిజీవి ఏదో వొక విధానంలో ప్రయత్నం చేస్తూ వుంటుంది...అందులో ఇదొక విధానమని నేను సరిపెట్టుకున్నాను—'

ఆమె చెప్పిన మాటలైతే మధురంగానే వున్నవి, కాని అంత తేలిగ్గా ఎలా సరిపెట్టుకో గలిగిందో అతనికి అర్థం కాలేదు. బహుశా సంవత్సరాల అనుభవాల తాలూకు సారాన్ని మాత్రమే ఆమె గ్రహించి వుంటుందేమో? జీవితాన్ని తరచ సాగాక; శ్రమను లెక్క చెయ్యకుండా

ఉండగలగటం ఒక నిపుణతే! శ్రమించిన సంగతే మరిచిపోయి, లభ్యమైన సౌఖ్యాన్ని సునాయాసంగా వొచ్చి పడిందనే మానసిక తృప్తినిచ్చే ఆనందాన్ని మాత్రమే గ్రహించే శక్తిని సంపాయించినట్లు ఉంది.

ఏమైనా ఆమె జీవితాన్ని గూర్చిన ప్రశ్నల్ని మరి వేయకూడదనుకున్నాడు. ఆమె చెప్పే జవాబుల లోతుల్ని సరిగా అర్థం చేసుకోలేడు. అందుకని ఆ జవాబులు అతుకుల బొంతలుగా కూడా కనిపించ వచ్చు. అప్పుడు ఆమె తనను మోసగిస్తూన్నదనే మరోబాధ వెంటాడుతుంది. చూస్తూ చూస్తూ మోసగించబడటానికి అంగీకరించేందుకు మూర్ఖుడు కాదు.

కాస్త విశాలంగా ఆలోచిస్తే, ఆలోచించ గలుగుతే, ఆమె జవాబులోని నగ్న సత్యం తన కళ్ళకు కట్టినట్లయింది...తను ఎన్నాళ్లు బతికాడనేది ప్రశ్న కాదు; వెధవ కాకికూడా వందేళ్ళు బతుకుతుందంటారు! ఐతే రెండు శతాబ్దాల క్రితం కాకి ఎలా బతికిందో, యీ నాటి కాకికూడా అలాగే బతుకుతోంది. కాని మానవుడిలో శతాబ్దాలమాట అటుంచి, సంవత్సరకాలంలోనే అనేక మార్పులు వొస్తూన్నవి. తను ఎంత సంపాయించాడనేదీ కాదు; ఇంకా ఎంత సంపాయించబోతున్నాడనేదీ కాదు; లక్షలు సంపాయించినా బాధగా బరువుగా అసంతృప్తితో బతికేవాళ్లు తనకు తెలుసు. సరిగ్గా అవసరాలకు సరిపడేదే సంపాయించుకుంటూ, హాయిగా ఆనందంగా బతికే వాళ్ళు తనకు తెలుసు. అందుకని తను బతికిన దానికి, అనుభవించిందెంతనేదే ముఖ్యం, ఎంత సుఖపడ గలుగుతున్నాడనేదే ప్రధానం! యీ ఆశయంలోని మంచి చెడ్డలు వేరొక విషయం. కాని చివరకు తనకు దక్కేది మాత్రం ఆ సుఖమూ, దాని తాలూకు మధురస్మృతులు మాత్రమే కదా!

అందుకని అతని జీవిత దృక్పథం వెనువెంటనే మారి తీరవలసిన పరిస్థితి ఏర్పడింది. సుఖం! ఆనందం! అదే అతని దృష్టిలో నిలబడింది. అది ఎలా లభ్యమైతే నేమి, దాన్ని చేజిక్కించుకోవటం తన విధి! తను పొందిన మనోవేదనలోని కష్టం, బాధ మొదలైన వాటికి, తను పొందే సౌఖ్యమే అంజనం!...ఇతర మానవులు కూడా తనలాగే ప్రయత్నాలు చేస్తున్నారు. ఒకవేళ వాళ్ళంతా తనకన్న భిన్నమైన మానసిక ప్రవృత్తులు గలవారే ననుకున్నా తనకేం లెక్క? తన సుఖాలకు వారు

కారకులు కానట్లే, వారి వాటికీ తను కారణం కాదు. అయినా వాళ్ళ ప్రస్తావనే తనకు అనవసరం.

గడియారం ఎనిమిది కొట్టింది. సూర్యం ఆలోచనలకు అంతరాయం కలిగింది. నిజంగా ఆకలయి కాదుగాని, గడియారానికి అలవడ్డ జీవితంలో ఆయా గంటల్లో, నిమిషాల్లో నిర్వర్తించ వలసిన అనేక పనుల్ని, సంవత్సరాల పర్యంతంగా జీవితాన్ని ఒక దారిన నడుపుతూన్న గడియారపు ముళ్ళు హెచ్చరిస్తూనే ఉంటవి.

'భోజనం చేద్దామా?' అన్నాడు సూర్యం.

ఆమె కళ్ళతోనే తన ఒప్పుదలను ప్రకటించింది.

ఆమెను వెంటపెట్టుకుని వంటింటివైపు నడిచాడు సూర్యం. వంట వాడు రెండు వెండిపళ్లాలు అమర్చగానే ఆమె అంది: 'మీరు ముందు కానీండి. నేను తరువాత భోజనం చేస్తాను'

'అలాకాదు. నా పక్కనే కూర్చొని భోజనం చెయ్యాలి' అన్నాడు సూర్యం.

'ఇంటిదగ్గర కూడా నేను ఒంటరిగానే భోజనం చేస్తాను. ఎవరైనా పక్కను వుంటే...'

ఆమె మాట పూర్తిగాక మునుపే 'దిష్టి పెడతారనా?' అన్నాడు సూర్యం.

'కాదు. నాకు అలాంటి పిచ్చి నమ్మకాలు లేవు. ఒంటరిగా భోం చెయ్యటం అలవాటు...అంతే! నన్ను బలవంత పెట్టవొద్దని కోరు తున్నాను.'

'ఐతే ముందు నీవే భోంచెయ్యి...'

'ఈ ఒక్కసారికి నా మాట వినండి—' అందామె ప్రార్థనా పూర్వక స్వరంతో. సూర్యం మరి కాదనలేక పొయ్యాడు. ఒకరినొకరు అర్థం చేసుకుంటూ వీలైనంత వరకూ ఒకరితో ఒకరు సరిపెట్టుకో గలగటం మీదనే జీవితానందం ఆధారపడి వుంటుందనే సత్యాన్ని యీ క్షణంలో అతను విస్మరించ లేదు.

'ఐతే నీవు ఇక్కడే వుండాలి. ఒంటరిగా భోంచెయ్యటం నీకెంత అలవాటో, తోడు లేకుండా భోంచెయ్యటం నాకు అంత అలవాటు లేని పని...'

'మరి రోజానో?' అందామె.

దీనికి సూర్యం వెంటనే జవాబు చెప్పలేదు. ఎంతమందికి వడ్డించాలో తెలియక, యజమాని ఆజ్ఞకోసం వేచివున్న వంటవాడి వైపు మాత్రం సూర్యం కాస్త తీక్షణంగానే చూశాడు. ఇలాటి సంఘటనేదీ ఇంతకు పూర్వం అలవాటు లేనందువల్ల, ఆ చూపు వెంటనే వంటవాడికి అర్థం కాలేదు. ఒక్క క్షణం ఆలోచించాడు; యీ లోగానే మరో హెచ్చరిక యజమాని నుంచి రాగానే, వాడు గ్రహించి, వంట ఇంటి నుంచే నిరమించాడు.

ఈ మార్పును ఆమె వెంటనే గమనించింది. పక్కనే వున్న వంటకాలను ఆమె వడ్డించ సాగింది. శ్రమ లేకుండానే తనకు కావలసిన విధంగా వాతావరణం యీ విధంగా మారటంలో ఎంత ఆనంద వుంది! విప్పి చెప్పకుండానే కేవలం చూపుతోనే మనుషులు తన మనసును అనుసరించి ప్రవర్తిస్తే ఎంత హాయిగా వుంటుంది!

ఆమె వడ్డన చేస్తూండగానే, ఆమె ప్రశ్నకు తన జవాబొకటి బాకీ వున్న సంగతి గుర్తొచ్చింది.

'రోజా అమ్మాయి తోడుగా వుండేది' అన్నాడు.

ఆమె విని వూరుకుంది. మరికొన్ని ప్రశ్నలు ఆమె అడుగుతుందేమో ననుకున్నాడు. ఆ ప్రశ్నలతో తనను బాధించ కూడదనే సూక్ష్మ దృష్టి ఆమెకు వున్నదనే సంగతి అతనికా క్షణంలో స్ఫురించ లేదు.

సూర్యం చాలా తృప్తిగా భోజనం చేయ సాగాడు. తనకు కావలసిం దేమిటో, తన మనసులో ఉండగానే తెలుసుకొని మసులుకో గల సత్యవతి పక్కన వుండగా తృప్తి కొరవడు తుందనే సందేహానికి తావు లేదు...

గతించిన సంసార జీవితం మళ్ళీ గుర్తుకొస్తోంది. తన భార్య కూడా దగ్గర వుండి ఇలాగే తినిపించేది. తనకు లేని ఆకలి పుట్టుకొచ్చేది...తిరిగి అలాటి జీవితమే ఆరంభమైన సూచనలు కనిపిస్తున్నవి. మళ్ళీ ఆ రోజు —కాదు—ఆ రోజు లాటివి రావనుకున్నాడు—కాని అవి చాలా తేలిగ్గా రానే వొచ్చినవి. మానవుడి తెలివి తేటలు, కాల చక్రాన్ని వెనక్కు తిప్పినందు వల్ల కలిగే అనుభూతుల్ని సృష్టించగలవు కాబోలు!

ఆ పూర్వ స్మృతులు రేగి బాధ కలగకుండా ఉండేందుకని, సూర్యం చాలా త్వరగానే భోజనం ముగించి—

'నేను వెళుతున్నాను—' అన్నాడు.

ఆమె 'సరే' నన్నట్లు తల తిప్పింది.

సూర్యం పోర్టికోలోకి వొచ్చాడు. అక్కడ డ్రైవర్ కూర్చొని వున్నాడు. వాడి సంగతే ఇందాకటి నుంచీ మరిచి పోయినందుకు సూర్యం నొచ్చుకున్నాడు.

'నీవు ఇంటికి పో... రేపు రావొచ్చు' అన్నాడు.

డ్రైవర్ వెళ్ళ బోతూండగా సూర్యానికి కొత్త సందేహం కలిగి అతన్ని వెనక్కి పిలిచాడు.

'ఆమెకు ఎంత ఇవ్వాలి?' అని అడిగాడు.

ఈ సున్నితమైన ప్రశ్నకు జవాబు చెప్పటం డ్రైవర్‌కు ఇష్టం లేదు. అందుకని, ఎందుకైనా మంచిదనే ఉద్దేశంతో 'మీ ఇష్టం—' అన్నాడు.

ఈ బరువు భారాలు తన మీద వేసుకోవటం సూర్యానికి అసలు ఇష్టం లేదు. తీరా ఆ ఇవ్వటంలో జరిగే లోపం వల్ల ఆమె కష్టపడుతుం దేమో? తనకు మరీ కొత్త మేళాం కావటం వల్ల ఇలాటి సందర్భాలు చాలా ఇబ్బందిగా కనిపిస్తూన్నవి.

'అది కాదు...ఎంతో సరిగ్గా చెప్పు—'

డ్రైవర్ కాస్త ఇరుకున పడ్డాడు. ఆమెనే అడగమని చెపుదా మనుకున్నాడు కాని, ఆ జవాబు తనకు క్షేమకరం కాదని ఊరుకున్నాడు. ఏదో వొక జవాబు చెప్పి ప్రస్తుత పరిస్థితి నుంచి తప్పుకోవాల్సిన కర్తవ్యం అతన్ని తొందర పెట్టింది. తను టాక్సీ డ్రైవర్‌గా ఉన్నప్పుడు ఆమె మామూలుగా తీసుకునే మొత్తాన్ని చెప్పి సరిపెడదామనే ఉద్దేశంతో 'ఒక వంద...' అని పూరుకున్నాడు.

సూర్యం మనస్సు చాలా తేలికైంది. ఆ 'తేలిక' డబ్బు మొత్తంలో కాదు; ఆ మొత్తాన్ని తెలుసు కోవటంలో! డ్రైవర్‌ని వెళ్ళమని తలూపాడు...

ఇంతా ఏడు సే వంద! వందరూపాయి లంటే చాలా మందికి పెద్ద మొత్తమే కావచ్చు కాని, వేలకు వేలు సంపాయించే విద్య తెలిసిన

తనకు మాత్రం ఇనొక లెక్కలోది కాదు. ఈ వెధవ వందతోనూ తను పొందగలిగిన మనశ్శాంతిని పోల్చి చూస్తే—అది తన ప్రాణాన్నే కాపాడగలిగింది. కఠిన తను సమస్య నొకదాన్ని ఇట్టే తేల్చి పారేసింది! ఆ విలువను నిర్ణయించ గలగటం తన శక్తికి మించిన కార్య మైనప్పటికీ, దాన్ని తక్కువ విలువతో తూచటం అవమానించటమే అవుతుంది. ఆ మొత్తాన్ని పెంచి ఇవ్వటమే భావ్యం; అప్పుడే తన తృప్తికూడా పెరుగుతుంది. ఆ మొత్త మెంతో నిర్ధారణగా తేల లేదు; అది తేలేందుకు తగిన వ్యవధ వుంది.

ఈ ఆలోచనల్లోనే సూర్యం పడక గదిలోకి వెళ్ళాడు. జేబులో వున్న నోట్ల కట్టల సంగతి గుర్తుకొచ్చి ఇనప పెట్టె తీశాడు...ఆ రివాల్వరే మళ్ళీ అతని దృష్టిని ఆకర్షించింది. దాన్ని అటూ ఇటూ తిప్పి నవ్వుకున్నాడు. దీంతోనే తాను ఆత్మ హత్య చేసుకునేందుకు సిద్ధపడ్డాడు. కాని ఆ అవసరం రేపు రాదు; అసలు జీవితంలోనే మరిరాదు; వొచ్చేందుకు వీల్లేదు. ఒక క్షణిక బలహీనతతో తాను పొందిన మనోవేదనను, మరో క్షణిక బలహీనతతో అంతం చేసుకోవా లనుకోవటం ఎంత బుద్ధి మాంద్యమో అర్థమైంది...ఇంతా ఏదుస్తే ఆ క్షణిక బలహీనత విలువ ఒక్క వంద రూపాయలు!

రివాల్వర్ తో పాటు నోట్ల కట్టల్ని కూడా యధాస్థానాల్లో వుంచి సూర్యం ఇనప పెట్టె మూసివేశాడు. ఆ తరువాత దుస్తుల్ని మార్చి అద్దంలో తనను చూసుకున్నాడు.

ఆశ్చర్యం! సరిగ్గా మూడు గంటల క్రితం ఇదే అద్దంలో తన ప్రతిబింబం, పదేళ్ళ తరువాత తను ఎలా ఉండేదీ చెప్పింది; కాని ఇప్పుడో— సరిగ్గా పదేళ్ళ క్రితం తను ఎలా వుండేదీ చెబుతున్నది. గడిచిన మూడు గంటల కాలంలోనూ కొన్ని సంవత్సరాల జీవితం చవిచూసినట్లుంది. కేవలం పరిస్థితులు కాలగమనాన్ని ఏవిధంగా మార్చ గలిగేదీ అర్థమవుతోంది.

ఇప్పుడు తను నిజంగా యువకుడే! గడిచిపోయిన యవ్వనాన్ని, ఏ కాయకల్ప చికిత్సా ఇవ్వలేని వయస్సును, తనకు ప్రసాదించ గలిగింది— ఆమె! పురుషుడు నిత్య యవ్వనుడేనని నిరూపించగల ఆమె సామ

ర్థ్యాన్ని, ఇప్పుడిప్పుడే తను తెలుసుకో గలుగుతున్నాడు. యీ మె—యీ అందాలరాశి,తనను ఏమైనా చేయగలదు; తనచేత ఏమైనా చేయించగలదు! స్త్రీ శక్తినీ, విభిన్న ప్రకృతుల్లో ఆమె రూపొందించ గల పరివర్తనల్నీ సూర్యం రెండోవైపు చూడగలుగుతున్నాడు.

తన ప్రతిబింబాన్ని తాను ఎన్నడూ ఇంత పరీక్షగా చూసుకో లేదు. తను పెద్ద అందగాడు కాదనే నమ్మకం వుండేది...కాని ఇప్పుడో; నిజంగా తనూ అందగాడేనేమో ననిపిస్తోంది. తన అందాన్ని తన చేతనే గుర్తించేట్లు చేయగల సత్యవతి తనకు లభ్యమవటం నిజంగా గొప్ప అదృష్టం

కనీసం ఐదు నిమిషాలన్నా అద్దంలోని సూర్యంతో నిజమైన సూర్యం ఆటలాడు కున్నాడు. గర్వంతో పాటు, ఆత్మబలం కూడా పెంపొందింది. నిజంగానే ఒకానొక కొత్త 'అర్హత' అతనికి లభించినట్లయింది. నూతన ఆశల్ని సృజించుకొని, వాటిని తీర్చుకొని, ఆనందించ గల మనోధైర్యం అతన్ని ముంచెత్తింది.

తోటలోకి వున్న కిటికీ తెరిచాడు. బైట చీకటి. గాలి కాస్త విసురుగానే వీస్తూవుంది. ఆకాశం మబ్బుల బరువుకు వొంగినట్లుగా వుంది. తిరిగి వాన కురిసే సూచన లున్నవి....

బైట ఏమైతేనేం, ఏం జరిగితేనేం? యీ గదిమాత్రం జీవితంతో తను పొందగలిగే అపూర్వ అనుభవాలకు ఆట పట్టవబోతూంది. బైటి వాతావరణంతో తనకు పనిలేదు; దాన్నిగూర్చి తాను ఆరాట పడనక్కర్లేదు! అది తన చెప్పు చేతల్లో ఉండక పోవడమే కారణం! కాని ఇక్కడి వాతావరణమంతా తనకు అనుకూలంగా, తనకు ఇష్టమైన పద్ధతుల్లోకి మార్చుకో దగిందిగా తయారు చేసుకో గలిగాడు. యీ కృత్రిమ పద్ధతుల్లోనే సౌఖ్య పడగలిగే అనేక అవకాశాల్ని మానవుడు కల్పించుకో సాగాడు; ఇందుకోసమే లోకంలోని మేధావు లందరూ కష్టించి మానవ సౌఖ్యాన్ని పెంపొందించే విధానాలను కనుగొన్నారు; ఇంకా కనుగొంటూనే వున్నారు.

ఈదురుగాలి తగలకుండా, సూర్యం కిటికీ మూసేశాడు...అతని మనసులో ఇతర ఆలోచనలు గజిబిజగా సంచరించటం ఆగి పోయింది.

ఊస్తానే ఆమె రాకకోసం ఆతృతగా వేచి ఉండటంలోని మధుర వేదన అతన్ని బాధించ సాగింది.

సూర్యం ఎక్కువ సేపు ఒంటరి పాటుతో సతమత పడకుండానే ఆమె వొచ్చింది. వస్తూనే ఆమె వెండిపళ్ళెంలో ఆకులూ; వక్కలూ తెచ్చింది. నిజానికి యీ మర్యాదలన్నీ ఆమె ఇంట్లోనే తనకు జరిగి వుండవలసింది. కాని యీమె ఆ మర్యాదల్ని తన ఇంట్లోకూడా పాటించుతోంది. తను చేయవలసిన మర్యాదల్ని, ఆమె నుండి తను పొందుతున్నాడు. తన కుటుంబంలోని వ్యక్తిగా ఎంత తేలిగ్గా, ఎంత త్వరగా, ఎంత సన్నిహితంగా ఆమె మారిపోగలిగింది!

వక్క నములుతూంటే ఆమె ఆకులకు సున్నం రాచి ఇవ్వసాగింది. తాంబూలాన్ని సేవించటంలో సూర్యం నిమగ్నుడై వున్నప్పటికీ, అతని బుర్రలో తన శోభనపు రాత్రి—ఆ తరువాత, జీవితంలో తాను సుఖపడ్డ సమయాలు గుర్తుకు రాసాగినవి. అలాంటి సమయాలు జీవితంలో మరి ఎదురవ్వవనుకున్నాడు; కాని ఎదురైనవి. అలా జరిగే అవకాశాలున్నవనే విశ్వాసంతో, తిరిగి ఆ సౌఖ్యం కోసమై చెయ్యి జాపాడు; ఆ సత్యవతితో జరిగిన పరాభవం వల్ల శాశ్వతంగా తను ఒంటరి జీవితానికే అర్హుడని తలపోశాడు... కాని యీ సంఘటనతో, అడ్డదారి వొకటి వున్నదని తనకు జ్ఞానోదయమైంది. యీ దారి చాలా దగ్గరిదే కాకుండా, ప్రమాద రహితమైంది కూడాను! అతి స్వల్ప కాలంలో ఒకే సంఘటనలోని ఇంద్ర ధనుస్సు రంగులన్నీ కళ్ళముందు ప్రత్యక్షమౌతూన్నవి!

ప్రమాద వశాత్తు కావచ్చు—తనను నఖశిఖ పర్యంతమూ అర్థం చేసుకోగల స్త్రీ లభ్యమైంది. తన హృదయాన్ని విప్పి చెప్పేందుకు భాషలోని పదాల్ని వెతుక్కోనక్కర్లేదు; కవిత్వ ధోరణికోసం తంటాలు పడక్కర్లేదు. ఆమెకు సరిగా అర్థమైందో లేదోననే బాధ కూడా అనవసరం. తనకు చేతనైన విధంగా, తునకు సౌంజ్ఞల రూపేణా

ఐనా సరే, తను ఆమెకు అర్థం కాగలడు. అన్నిటినీ మించి చేయరాని పనేదో చేస్తున్నాననే కల్మషాత్మ బాధనుంచి అతను విముక్తుడయ్యాడు. కాని ఎంత ప్రయత్నించినా సత్యవతికి అర్థమయ్యేట్టు మాత్రం తను చెప్ప లేక పోయ్యాడు.

ఇంతకన్న కోరదగింది యీ ప్రపంచంలో ఏమీ లేదని సూర్యానికి తోచింది. యీమెతోడి అనుభవం అతి సామాన్య సంఘటనే కావొచ్చు; కాని తను పొందిన అవమానం యీ సంఘటనకు అసామాన్యమైన విలువను ఇవ్వగలిగింది.

ఆమెను దగ్గిరికి లాక్కుంటూ 'నిద్ర వొస్తోందా?' అని అడిగాడు సూర్యం.

సున్నితంగా తల అడ్డంగా తిప్పుతూ 'ఊహుఁ. మీరు పక్కన వుంటే నిద్ర ఎలా వొస్తుంది?' అన్నదామె!

తన పురుషత్వానికి ఎన్నడూ ఎరగనంత విలువను ఆమె తనచేత గుర్తించేట్టు చేసింది. ఆ ఒక్క మాటతో అతను ఎంతో శక్తిని పొందాడు; ఎంతో గర్వపడ్డాడు కూడాను!

'మీకు నిద్ర వొస్తోందా?' అందామె అతని ముఖంలోకి చూస్తూ.

'లేదు. రోజూ నిద్రాదేవితోడి స్నేహంతో విసుగెత్తి పోయ్యాను. కనిపించని నిద్రాదేవి కన్న, కనపడే నీవే నాకు అధికురాలివి' అన్నాడు.

'కొన్నాళ్ళకు నాతోడి స్నేహంతో కూడా మీరు విసుగెత్తి పోతారు' అందామె, నవ్వుతూ.

'నిజమే కావొచ్చు' అనుకున్నాడు సూర్యం. ఐనా ఆ స్థితి రావడానికి ఇంకా కొంత వ్యవధి వుంది. ప్రస్తుత సమస్యలకు తోడు, ఎప్పుడో వొచ్చే సమస్యల్ని కూడా జత చేసుకొని బాధపడటం మౌఢ్యమే అవుతుంది కనుక, ఆ విచారమంతా వాయిదా పడింది! ఒకవేళ ఆమె అన్నట్లు నిజంగా విసుగెత్తినప్పటికీ ప్రమాదం లేదు; ఎందుకంటే తనకు కావాలనగానే ఎంత తేలిగ్గా యీమె లభ్యమైందో, అక్కర్లేదనగానే అంత తేలిగ్గానూ వొదిలించుకోగలడు.

మొహమాటం కోసమన్నా 'ఎల్లకాలమూ నీ స్నేహమే నాకు కావాలి' అందామనుకున్నాడు; కాని అలా అనకపోయినా ప్రమాదమేమీ లేదనిపించింది. ఎందుకంటే ఇదొక రకం వ్యాపారం; చిన్న

క్షాంట్రాక్టు పద్ధతి; యీ సంగతి ఆమెకూ తనకూ కూడా తెలుసు. ఇంకో రకంగా దీన్ని తీసుకో నక్కర్లేదు. [illegible] ఆ డబ్బుకు గాను ఆమె తనను కొన్ని గంటలు సుఖపెట్టటం! అంతకు మించిందేమీ ఇందులో లేదు. కనుకనే తనలో లేని భావాలను ఉన్నట్లు నానా అవసలూ పడి నటించ నవసరం లేదు—ఇదే భార్య దగ్గరైతే...! ఎంతో నటన అవసర మయ్యేది! విశాల హృదయత్వాన్ని, ఔదార్యాన్ని, ప్రేమనూ, అభిమానాన్ని, ఇంకా సవాలక్ష వాటిని తను వెల్లడించ వలసి వుండేది! యీ విధంగా ఆమెను మోసం చేయటం, ఆమె చేత మోసగించ బడుతూండటం జరిగేది!

ఆ తరువాత మాట్లాడేందుకు సూర్యానికేమీ పాలు పోలేదు. ఆకలైన వాడు ఆహారాన్ని చూసినప్పుడు పొందే ఆత్రుత, తొందర పాటు లాటివి, అతనికీ కలిగినవి. అతని అవసను గమనించ గలిగిన నేర్పరి కనుకనే, ఆమె పెద్ద లైటును ఆర్పేసి, డిమ్మర్ వేసింది.

ఆ తరువాత కొద్ది నిమిషాల్లోనూ సూర్యం స్వర్గ సౌఖ్యాన్నే అనుభవించాడు! తను పొందిన తృప్తిని తనే చెప్పలేని స్థితిలోకి వొచ్చాడు.

కాని యీ ఉద్రేకమంతా తగ్గాక, సూర్యం మామూలు మనిషయ్యాడు; యీ మార్పుతో పాటే అతని మనోభావాలు కూడా పూర్తిగా మారిపోయినవి. ఆకలైన వాడికి ఆకలి తీరేముందున్న ఆత్రుతా, ఆహారం పట్ల అతనికి కలిగే తొందర పాటూ, ఆకలి తీరాక ఉండవు; కడుపు నిండాక ఆహారంపట్ల ఒక రకం ద్వేషభావం లాంటిది కూడా కలుగుతుంది; సూర్యం స్థితి అలాగే మారింది—అతని 'పశుత్వం' తృప్తి పొందాక, అది విసర్జించబడి, దాని స్థానే మానవత్వం—కేవలం మానవత్వం మాత్రమే నిలిచి పోయింది.

ఏదైనా తనకు కావాలనే ముందు వుండే ఆరాటం, తన దయ్యాక తగ్గక తప్పదు. మూసి వుంచిన కొండల నునుపూ, రహస్యం వెల్లడయాక తగ్గే విలువలూ సహజమే గదా! అవసరం తీరాక, కేవలం తనూ పొందగలిగానన్నే తృప్తి, తనకూ తక్కువైందేమీ లేదని ఇతరులకు తెలియ పరచటం నిమిత్తమే కొన్నిటిని తాను భరించవలసిన అవసరం వుంది.

తననుముంచెత్తి, దాదాపు పిచ్చివాణ్ణి చేసిన ఉద్రేకం ఇదేనా? ఇంతేనా? అనిపించింది. మానవత్వానికీ, రాక్షసత్వానికీ వున్న దూర

మంతా యీ ఉద్రేకం తాలూకుదే ననే సత్యం కళ్ళకు కట్టినట్లయింది. పొంగే పాలమీద నీళ్ళు చల్లనట్లయితే అవి పొయ్యిపాలు అవుతవి. అదే విధంగా తన యీ ఉద్రేకానికి కొంత ఉపశమనం కలిగింది; ఇదే కలగ నట్లయితే—తను ఎంతదూరం పొయ్యేవాడో, ఏమేమి చేసేవాడో ఊహకు కూడా అందని విషయం!

సత్యవతి గుడ్లప్పగించి తననే దీక్షగా చూస్తోంది. ఆ చూపులో తనకు ఆహ్వానం—కాదు—తనకొక ఛాలెంజ్ కనిపిస్తోంది. కాని యీ స్థితిలో ఆమె ఛాలెంజీలకు తను అతీతుడు. ఇంతకు ముందువలె కాక, ఇప్పుడు ఆమె తనను ఆకర్షించలేని సామాన్యురాలివలె మారిపోయింది! లేదు—ఆమె మారలేదు; కేవలం తను, తన మనస్తత్వమే మార్పులకు గురైంది. ఏమైతే నేం—ఆమె మీద ఒక రకం జాలి తనలో పని చేయటం మొదలెట్టింది.

నిజానికి యీ పరాయి ఆడది, తన పట్ల ఎంతో సానుభూతిని చూపటమే కాదు; ఒక రకంగా తనలో మాయమైన మానవత్వాన్ని తిరిగి ప్రవేశ పెట్టింది. పొరపాటు చేశాక పశ్చాత్తాప పడటంతో, ఆ తప్పు తాలూకు బరువు వొదిలిపోయి, మనస్సు తేలిగ్గా వున్నట్టే, యీమెవల్ల తను పశ్చాత్తాపాన్ని, ఒక విధంగా జ్ఞానాన్ని కూడా పొందాడు. యీ జ్ఞానకాంతిలో తను ఎప్పుడు, ఎక్కడ కాలుజారిందీ, ఎప్పుడు తిరిగి నిలవ తొక్కుకో గలిగిందీ అర్థమౌతోంది. ఆమె త్యాగం ఆమె స్థితిని పెంచక పోయినా, దాన్ని పొందిన తను మాత్రం మేలుకొని, దిగజార కుండా ఉండగలిగాడు.

సత్యవతి మీద ఎంతజాలి కలిగిందో తనకే తెలియదు! ఆమెను ఇంకేస్థితిలోనూ తను బాధపెట్టి ఉండేవాడు కాదు. ఆమె తన పశుత్వానికే బలిఐంది! కనుకనే తను రక్షించ బడ్డాడు... కాని నిజంగా ఆమె బాధపడ లేదేమో? కేవలం తను సంపాయించే డబ్బు కోసమై యీ బాధను (?) భరించిందేమో! కాని తన దృష్టిలో మాత్రం ఆమె తన కోసమై బలిగావింప బడ్డది.

పాపం!—తనింకా ఆ కామోద్రేకంలో, ఆ మైకంలోనే కొట్టుకుంటున్నా డనుకుంటోంది కాబోలు ఆమె! ఒకవేళ సత్యవతి పొరపాటు పడినప్పటికీ, తాను దానిని సవరించ దలచ లేదు. ఎందుకంటే,

ఆమె దృష్టిలో తన స్థితి ఎంత దిగజారి పోతుందో, తను ఆమెనుంచి అంత సానుభూతిని పొందే అవకాశం వుంటుంది.

సత్యవతి ఆవలించింది; తన దృష్టిని ఆకర్షించేందుకు చిటికలు వేసింది కూడాను. పదేళ్ళ క్రితమైతే యీ రకం స్త్రీతో ప్రవర్తన వేరు విధంగా వుండేది. కాని ఇప్పుడు, తన మనశ్శాంతి కోసం, తన ఆనందం కోసం, ఆమె జోలికి పోనక్కర్లేదు. ఆమె అవసరమైనప్పటికీ, తనకు కేవలం అనవసరం.

'నిద్ర వొస్తోందా ?' అన్నాడు సూర్యం.

'ప్పి.'

ఆమె అబద్ధం మాడ లేదు; ఆ సంగతి సూర్యానికి తెలుసు. కాని ఆమె అబద్ధమాడినట్లూ, తాను సంగతి గ్రహించినట్లూ నటించటం అవసరం.

'నీవు నిద్రపో—' అన్నాడు.

'మీరు ?'

'కాస్సేపు పనివుంది...'

యీ జవాబు అలక లేదు. ఐనా అతికినట్టుగానే ఆమె వూరు కుంది. ఆమె కళ్లు మూసిందేమోనని సూర్యం పరీక్షగా చూశాడు; లేదు...తనుఅన్న కాస్సేపు పని ఏమిటోనని ఆమె చూస్తున్నట్లుంది...!

'నా వైపు చూస్తూ పడుకుంటే నిద్ర రాదు. అటు తిరిగి పడుకుంటే—'

ఇబ్బందిగానే ఆమె గోడవైపు తిరిగి పడుకుంది. 'ఎంతమంచి పిల్ల!' అనుకున్నాడు. ఆమెకు అభిప్రాయాలు, అధికారాలు ఏమీలేవు. చెప్పి నట్లు వినటం ఒక్కటే ఆమె ఆదర్శం! ఎలక్ట్రిక్ ఫానల్లేనే కావాలన్న ప్పుడు, గాలి వేగం హెచ్చించటమూ, తగ్గించాలంటే తగ్గించడమూ సాధ్యం; అక్కర్లేదంటే మరి తిరగదు! మానవుడికీ, యంత్రానికీ భేదమే లేని స్థితి వొకటి వుందనే సంగతి సూర్యానికి ఇప్పుడే తెలిసి వచ్చింది.

యీమెతో తను సుఖపడగలిగేదేమిటి? తన మాటకు ఎదు రాడదు. అంతా తన ఇష్టాను సారంగానే ప్రవర్తిస్తుంది. యీమె ఐనా, యీమెలాటి రబ్బరు బొమ్మయినా ఒకటే! రెండింటికీ భేదమల్లా కేవలమూ ప్రాణం !

కాని తనకు ఎదురు తిరిగి ప్రవర్తించి నట్లయితే, అప్పుడు కూడా యీ మెను భరించటం కష్టమే! తగిన ప్రతిఫలం పొందుతూ, విశ్వాస రహితంగా, తనను లెక్క చేయనట్లయితే, ఎంత అసంతృప్తికైనా గురి కాక తప్పదు. ఈ రెండూ తనకు పనికిరావు. త్వరలోనే విసుగెత్తి పోతాడు. కనుక తను కోరదగింది ఏమిటనే ప్రశ్నకు జవాబు దొరికినట్లే దొరికి, తిరిగి పాత సమస్య ప్రత్యక్షమైంది!

తనకు ఏం కావాలో తెలుసుకో గలగటం జీవిత రహస్యమే ఐ వుండొచ్చు. దాన్ని తెలుసు కునేందుకు చేసే ప్రయత్నాలలో, ఎప్పటి కప్పుడు జయం తన వల్లనే కనిపిస్తుంది; కాని ఇంకా కాస్త ముందుకు సాగాక కాని, తన పొరపాటు అర్థం కాదు. దీన్నిబట్టి చూస్తే యీ విధంగా తను పొరబడటమే తను ముందుకు సాగేందుకు ఉపయోగ పడుతోందేమో? అంటే జీవితంలోని యీ రహస్యం, రహస్యంగా వున్నంత కాలమూ, దాన్ని ఛేదించే ప్రయత్నంతో నన్నా, జీవితాన్ని అనుభవించ వలసిన అవసరం ఏర్పడుతోంది!

ఆమె కదలటం లేదు. బహుశా నిద్రపోయి వుంటుంది. నిజంగా నిద్రపోయిందో లేదో తెలుసుకుందా మనుకున్నాడు; కాని ధైర్యం లేక పోయింది. తెలుసుకుంటే చూస్తూన్న దాన్ని వేరు విధంగా, తనకు అను కూలంగా సృష్టించుకోవటం వల్ల మనస్సు తేలికవుతుంది. ఉదాహరణకు ఆమెకు ఇంకా నిద్ర పట్టనట్లయితే, పదిహేను నిమిషాల క్రితం తను పడిన బాధంతా తిరిగి తనను కమ్ముకుంటుంది. అందుకని ఆమె నిద్రపోయి నట్టుగానే భావించుకొని, నమ్మేందుకు ప్రయత్నం చేస్తే, ఒక విధంగా ఆ బాధనుంచి తను విముకుడు కావొచ్చు. ఐతే అసత్యాన్ని ఇతరుల చేత నమ్మించటం తేలికే కాని, అసత్యమని తెలిసి, తనకు తానే నమ్మటం చాలా కష్టం! నమ్మినట్లు నటించ సాగినప్పటికీ, కల్మపాత్మ ఒక పక్కన మూలుగుతూనే వుంటుంది. ఆ మూలుగు తనను బాధించ కుండా వుండేందుకు, దృష్టిని మరో కోణానికి తిప్పుకోవటం అవసరం!

నాలుగు గోడల మధ్యా ఊపిరాడ నట్టుగా వుంది. బైటినుంచి కొంత గాలి అవసర మనిపించింది. కిటికీ తలుపులు తెరిచి, కుర్చీ కిటికీ దగ్గరకు లాక్కున్నాడు, బైట వెన్నెల పరుచుకొని ఉంది. సన్నగా

వాన తుప్పర కూడా ఆరంభమైంది. వాతావరణంలోని యీ మార్పుతో పాటు, అతని ఊహలు కూడా మారసాగినవి.

ఆ వెన్నెల్లో బవర్ స్పష్టంగా కనిపిస్తూ వుంది. తనకూ, ఆ బవర్‌కూ యాభై గజాల దూరం వుంది. ఈ దూరం ఎనిమిది గంటల క్రితం, తన చావు బతుకుల దూరంగా తోచింది. కాని ఇప్పుడు—ఆ దూరాన్ని తేలిగ్గా దాటగల మనోధైర్యం లభ్యపడింది. ఈ ధైర్యాన్ని తనకు ఇవ్వగలిగింది—యీ వేశ్య!

వేశ్య సమాజానికి పనికిరాని వ్యక్తి అనే అభిప్రాయం అతనిలో మటుమాయమైంది. పైపెచ్చు ఆమె తనలాంటి నిర్భాగ్యులను ఉద్ధరించగల శక్తి గలదని కూడా అతను గ్రహించాడు. ఈమె కూడా లభ్యం కానట్లయితే, యీ రాత్రంతా అశాంతితో గడపటమే కాదు; ఆ పిచ్చి ఉద్రేకంలో ఎన్నో అఘాయిత్యాలు సైతం చేసేవాడే! ఇనప్పెట్టెలోని రివాల్వరును ఉపయోగించే వాడేమో కూడాను! ఆ ఉపయోగం తన పట్లనే జరిగినట్లయితే, తన చావు ఒక గొప్ప రహస్యంగానే ఉండి పొయ్యేది! ఒక ఆడది తనను చావుకు పురికొల్పితే, మరో ఆడది తను బతికేందుకు తగిన ధైర్యాన్ని ఇచ్చింది. స్త్రీత్వంలోని ఈ రెండు రకాల విరుద్ధ శక్తుల్ని తను కొద్దిసేపట్లోనే గ్రహించగలిగాడు.

గత సాయంత్రం ఆ బవర్‌లో జరిగిన సంఘటనకు తను ఎంత దిగజారి పోయ్యాడో, ఎంత మూర్ఖుడై పొయ్యాడో, ఇప్పుడు స్పష్టంగా తెలిసి పోతోంది. లోకంలోని స్త్రీలంతా ఒక పక్షాన వున్నప్పటికీ, జీవిత మాధుర్యానికి తపించనవసరం లేదు; ఎందుకంటే ఇప్పుడు తన గదిలో బంధించబడిన యీ ఆడది వున్నంత వరకూ, లోకంలోని స్త్రీత్వమంతా తనకు లభ్యమైనప్పుడు కలిగే ఆనందం, గర్వం తననుంచి ఎవ్వరూ లాక్కో లేరు.

అసలు యీ ఆడతోవ వుందని తనకు తెలిసి నట్లయితే, ఆ బవర్‌లోని సంఘటనకు అవకాశమే ఉండేది కాదు. ఆమెను బాధ పెట్టి, తను అనవసరంగా బాధ పడ్డాడు. ఆ ఉన్మత్తతలో ఆమె దృశ్యం నుంచి విరమించింది కనుక సరిపోయింది కాని, కానట్లయితే తను రాక్షసత్వాన్నే ప్రదర్శించి ఉండేవాడు అప్పుడే కాదు...తను ఆలోచించిన ప్రకారం, మర్నాడు ఆమె ఒంటరిగా తారసిల్లి నట్లయితే, మానవునిలోని దాన

వత్వపు వికృత ప్రదర్శన విధిగా జరిగి తీరేది. ఆమెను ఎంత నీచపరిచే వాడో, తనను తాను ఎంత నీచ పరుచుకునే వాడో; అదంతా తరువాత కాని తెలిసేది కాదు...

ఇప్పుడు అలాటి ప్రమాదం మరి లేదు. ఎందుకంటే తన వుద్రేకం, ఉన్మత్తత శాంతించ బడినవి. తను మామూలు మనిషి అయ్యాడు. ఈ సమాజంలో తిరిగేందుకు అర్హత గల పెద్దమనిషి తనాన్ని తిరిగి పొందాడు. ఒకప్పుడు దాన్ని పోగొట్టుకున్న సంగతి బహుశా ఎవ్వరికీ తెలియక పోవొచ్చు. కాని ఎంత తేలిగ్గా దాన్ని పోగొట్టు కున్నాడో, అంత తేలిగ్గానూ దాన్ని తిరిగి సంపాదించ గలిగాడు! కాదు—తనకా అర్హతను యీ వేశ్య ప్రసాదించ గలిగింది...ఏమీ జరగనట్లే తనలో ఏ పరివర్తనా, ఏ సంక్షోభమూ లేనట్లే తను నటించ గలడు. ఇప్పటి నుంచే తను ప్రపంచాన్ని ధైర్యంగా ఎదుర్కో గలడు!

మొదట్లో సత్యవతి మీద ప్రణయం రేకెత్తింది! తర్వాత ఆమె పట్ల అసహ్యం అంకురించింది; నిజానికి తనపట్ల తనకే అసహ్యం వేసింది. అది ఆమెపట్ల [illegible]ంగా మారింది...కాని ఇప్పుడో! [illegible] ఆమె పట్ల జాలిగా రూపొందింది. తన మనస్సు పొందిన యీ వివిధ రూపాంతరాలు తనకే ఆశ్చర్యంగా కనిపిస్తున్నవి. కామం కళ్ళకు ఎగదట్టిన సమయమది! ఇప్పుడా పొర తొలిగి పోయింది కనుక, తను పరిస్థితిని న్యాయ దృష్టితో చూడగలుగు తున్నాడు.

ఆమె తనను నిరాకరించటంలో తెలివితక్కువ తనం వుంటే వుండొచ్చు; కాని తను స్వార్థబుద్ధితో ఆమెను పొంద దలుచుకున్నట్లే, ఆమె కూడా తన సౌఖ్యాన్ని గురిగా పెట్టుకొని తనను నిరాకరించింది. ఇంకా నయం! తన స్థితిలోనే ఆమె వున్నట్లయితే, కొంచెం ఆలోచించి తనను అంగీకరించి నట్లయితే, ఎంతో గొప్ప అగాధంలోకి పడేవాడు! ఆమె అనాలోచిత ప్రవర్తన వల్ల తను మళ్ళీ లేవగలిగిన గోతిలోనే పడ్డాడు. అలా కానట్లయితే ఆ ఫలితాలు ఎంత దారుణంగా ఉండేవో ఇప్పుడు స్పష్టంగా తెలుస్తున్నవి.

ఇలాగే రాత్రి తను కుర్చీలో కూర్చొని బైటికి చూస్తూ, తలకాయలో ప్రవేశించే ప్రతి ఆలోచనతోనూ కుస్తీ పడుతూ సతమతమవుతూండే వాడు. తనకు శాశ్వతంగా భార్యాత్వాన్ని వహించి, నిర్వ

హించేందుకు కంకణం కట్టుకున్న సత్యవతి ఒక్కర్తే, మంచం మీద పడుకొని, తనకు భార్యయినందుకు నిట్టూరుస్తూ, నిద్ర పట్టక అటూ ఇటూ పొర్లుతూ వుండేది. ఆమె అవస్థను చూడలేక తను వేరొక గదిలోకి వెళ్ళటం జరిగేది—

అంతకన్న తను ఏం చేయగలిగే వాడు కనుక! వయస్సులోనా పావు శతాబ్దం తేడా! మరి భావాల్లోనూ ఆ భేదం వుండక తప్పదు. మొదట్లో ఆమె భావాలను తను మెచ్చుకున్నప్పటికీ, క్రమంగా అవి తనకు ఎంతో బాధాకరంగా తయారయ్యేవి. ఎందుకంటే ఆమె యవ్వనం తనకొక కొరుకుడు పడని సమస్యగానూ, తన అసమర్థ తను రుజూ చేసేదిగానూ రూపొందుతుంది. ఏ యవ్వనమైతే తనను ఆకర్షించి, మభ్యపెట్టి, ముందెంతో గొప్ప సౌఖ్యం వుందని వూరించిందో, అదే తనకు ఆగర్భ శత్రువవలె, క్షణక్షణమూ, తనను కలతపెట్టే పీడకలవలె భయంకరంగా గోచరిస్తూ వుండేది.

ఇది ఇం[illegible]గా జరిగేందుకు వీల్లేదు. ఇప్పుడు యీ సత్యవతి పట్ల తన ప్రవర్తన ఎలా వుందో, అప్పుడు ఆ సత్యవతి పట్లా అలాగే వుండేది. ఈమెకు ప్రణయ కళ తెలుసు; రకరకాల మొగాళ్ళనూ ఎరుగు; వాళ్ళను రంజింప చెయ్యటమే ఆమె వృత్తి. కాని సంసారిగా మారే ఆ అమాయకురాలికి ఇవేవీ తెలియవు. తనకు తెలిసినా అయోగ్యత వల్ల అంతా రసాభాస అయేది...

నిజంగానే సత్యవతి తన భార్య ఐతే...! ఈ కొంప ఒక నరకంగా మారేది. తన మీద ఆమె ఎంత ఇష్టాన్ని కలిగించుకో గలిగినా, కనీసం ఎంత ప్రణయాన్ని నటించ గలిగినా, తన వయస్సులో ఏ విధంగానూ మార్పు వొచ్చే- కాదు. పై పెచ్చు ఆమె నటిస్తోందనే వూహ ఎంతో బాధ కలిగించేది...ఇప్పుడు యీమె నటిస్తోందని తెలిసినా తనకు ఇబ్బంది లేదు. ఎందుకంటే ఆ నటనను మొదటి నుంచీ తను ఒప్పుకున్నాడు గనక! ఈమె పతివ్రత అనే భ్రమతో తను సత్యవతిని తెచ్చుకుని వుండి, ఆ తరువాత వేశ్య అని తెలిసినట్లయితే ఎంతో బాధ కలిగేది. మొదటి నుంచీ వేశ్య అని తెలిసే వుంది కనుక, మరో రకమైన డిసప్పాయింట్ మెంట్ ఉండేందుకు అవకాశం లేదు.

అదీగాక యీమె ఎవరు? తనెవరు? గత సాయంత్రం తమ మధ్య ఎలాటి సంబంధ మున్నదో, తెల్లారాక లేదా ఆమెను ఇక్కణ్నుంచి పంపేశాక అదే సంబంధం వుంటుంది! తన మీద ఆమెకు గొప్ప ఆశలూ, ఆశయాలూ లేవు. తనామెను ఎంత తేలిగ్గా చూడగలడో ఆమె కూడా తనపట్ల అదేవిధంగా ప్రవర్తించగల సమర్థురాలు. ఇంతకు పూర్వం ఎంత అపరిచితులుగా తాము వుండ గలిగారో, ఇకముందు కూడా అంతే! ఇది ఎవరికీ బాధ లేదు!

—కాని, వైవాహిక బంధంతో తాను సత్యవతితో బంధించ బడితే—ఆ బంధన ఎంత శాశ్వత మైనదో, ఎంత బలం గలదో తను ఊహించ గలడు. తన ఇష్టానుసారంగా ప్రవర్తించేందుకు ఆమె వేశ్య కాదు. భార్యగా తనకు గల సర్వ హక్కులనూ సాధించు కునేందుకు, తన స్వేచ్ఛలో భాగస్వామిని అయేందుకు, అవతరించిన మహామారిగానే తయారయేది. ఆమె ఎంత సాధ్వి ఐనా, ఎంత అమాయకురాలైనా, ఎంత మెత్తనిదైనా—క్రమంగా తనన్ని ప్రతి విషయాన్నీ గ్రహించేది... కనీసం ఆమెకు న్యాయం చేయటం లేదనే తన ఆలోచనల బాధ తనను నీడలా వెంటాడుతూండేది...

దానికి విరుగుడు ఏమిటి? కల్మషాత్మలో, దిద్దుకోలేని పొరపాటు తాలూకు పశ్చాత్తాపంలో, జీవిత శేషమంతా వేగిపోయ్యేవాడు. కుదరని రోగాన్ని భరించి తీరవలసిన అవసరం తప్పనిసరయ్యేది. ఎన్నడూ ఆమెకు స్వేచ్ఛనూ ఇవ్వలేడు; సుఖపెట్టనూ లేడు. లేనిపోని తద్దినాన్ని కొని తెచ్చుకొని మనశ్శాంతిని కోల్పోయి, నలుగుర్లోనూ నవ్వుల పాలయ్యేవాడు తను.

ఒక్క రాత్రికి, సత్యవతికన్న మేలురకపు స్త్రీ అనుకున్నామెను భరించలేని తను, ప్రతిరాత్రీ ఆ సత్యవతిని భరించ వలసి వచ్చేది. గత సాయంత్రపు వాతావరణంతో పాటు, బుర్రలో ప్రవేశించిన తలపుల తాకిడితోడై, సత్యవతిని పొందేందుకు ప్రయత్నం చేసి తీరవలసిన పరిస్థితిని కల్గించినవి. కాని యీసారి ఆ వాతావరణం లేదు—అంతకన్న గొప్ప వాతావరణమైనా తనలో మరి చలనం కలగదు. రోజూ చూసే చంద్రుడూ, వెన్నెల విలువ, ఒకానొక సమయంలో గొప్పగా కనపడుతవంటే—ఆ విలువలు కేవలం తన మనస్తత్వ పరిణామాల మీద ఆధార

పడినవే అవుతవి! ఆ పరిణామాలకు తను గురికానప్పుడు, మామూలు చంద్రుడూ, సామాన్యమైన వెన్నెలగానే తోస్తవి.

తనలో రేకెత్తిన పశువాంఛ వల్లనే తను తప్పుదారి పట్టేవాడు! ఆ పశువాంఛను తనెంతో దూషించుకున్నాడు. కాని ఆ పశువాంఛే కలగనట్లయితే, జీవితంలోనే చలనం ఉండేది కాదు; తను ఈ సత్యాన్ని గ్రహించే వాడూ కాదు. తను మానవత్వాన్ని తిరిగి పొందేవాడు కూడా కాదేమో?

పశు వాంఛను విసర్జించటం, దాన్ని హేయ భావంతో చూడటము, ఆనీచత్వానికి దిగజారటం కూడదనీ, తను చిన్నతనం నుంచీ వింటూనే వొచ్చాడు. చాలా కాలంగా అదంతా నిజమని కూడా భ్రమించాడు. ఇప్పుడు — తను పొందిన యీ పరిణామాల దృష్ట్యా చూస్తే—ఆశ్చర్యం! పశు వాంఛ లేని మానవుడు అసలు ఉండేందుకు వీల్లేదేమో ననిపిస్తోంది. ప్రతి రోజూ మనం పశువు పాలు తాగుతున్నాం. పశువునుంచే వొచ్చే నెయ్యి, మజ్జిగ వాడుతున్నాం; పశువు మాంసాన్ని కూడా తింటున్నాం. యీ విధంగా పశువులో నుంచి వొచ్చే ఆహారమంతా మానవ శరీరంలో కలిసి పోతోంది; దాంతో పాటే ఆ 'పశుత్వం' కూడా శరీరంలో ఒక భాగంగా తయారవుతూనే వుంది. యీ భాగం ఎక్కడ వుందని? శరీరమంతటా వున్న దాన్ని తొలగించుకోవటం ఎలా? దాన్ని ఏవగించుకోవటం వేరు; అది లేకుండా చేసుకోవటం వేరూను. ప్రతి రక్త కణంలోనూ వున్న పశుత్వాన్ని, విసర్జించలేని అసమర్థతను భరించటం తప్ప మరో మార్గమేమిటి?

సృష్టిలో మానవుడి కన్న పశువే ముందుగా పుట్టింది; పశువు పరిణామాలే మానవుడు అని మేధావులు రుజూ చేశారు. ఇది నిజమైనప్పుడు పశు లక్షణాలు శతాబ్దాల తరబడిగా మానవుడిలో పాతుకొని పోయి ఉండాలి. యీ పశుత్వం లేకుండా ఉండాలంటే, కొత్త మానవుడు అకాస్తుగా ఏ ఆకాశం మీది నుంచో ఊడి పడాలి!

అనాదిగా మానవుడు జంతువుల్ని పూజిస్తూనే వున్నాడు. తనూ జంతువు నుంచే ఉద్భవించి ఉండొచ్చనే భక్తే కారణమేమో? ఏ కారణమైతేనేమి గానీ, పశువులోని పశుత్వాన్ని పూజించటం జరుగుతూనే వుంది. దీన్నే వేరొక దృష్టిలో చూస్తే, పశుత్వాన్ని బహిరంగంగా ద్వేషి

స్తూన్నప్పటికీ, మానవుడు కొన్ని సమయాల్లో అది పూజించ తగిందేనని పూజా చేస్తూనే వున్నాడు. కనుక పశుత్వం పట్ల ఒకరకం గౌరవభావం మనలో తరతరాలుగా పాతుకొని పోయి ఉండాలి!

సృష్ట్యాది నుంచీ పశువు సహాయంతోనూ, వాని స్నేహంతోనూ, మానవుడు బతుకుతూ వొస్తున్నాడు. తన సౌఖ్యాలన్నిటికీ పశువును తెలివిగా ఉపయోగించుకో గలుగుతున్నాడు. యీ స్నేహం తాలూకు ఫలితాల్ని యీ నాడు వొదిలించుకో గలగటం సాధ్యమా?

ఇంతా ఏడుస్తే పశువాంఛ కింద చలామణీ అయేది ప్రకృతి ఆజ్ఞ! సృష్టి విస్తరణకు మూలం! దాన్ని తప్పించుకో గలిగిన శక్తి జీవులకు ఉండటమంటే, సృష్టి అంతటితో ఆగటమే అవుతుంది! కనుక జీవులకు ఇది తప్పదు. ఇద్దరు తమ పశు వాంఛను తీర్చుకున్నందువల్లనే తనకీ జన్మ ప్రాప్తమైంది; తన కేమిటి—ప్రతి జీవికి అదే పద్ధతి! ఎంత 'పవిత్ర ప్రేమ' కైనా చివరి మెట్టు పశు వాంఛే కదా...యీ సృష్టి వైపరీత్యాన్ని విస్మరించటం మౌఢ్యం గాక మరేమిటి?

కనుక తనలో కలిగే 'పశువాంఛ' అనబడేది చాలా స్వాభావికమైనదే కాని, దుష్టశక్తుల ప్రాబల్యం వల్ల వొచ్చిపడ్డది మాత్రం కాదు. ఐతే ఆ వాంఛ ఎవ్వరికీ హాని కలగకుండానే తనకు తృప్తికరంగా తీరే మార్గం లభించింది; ఇలాంటి పరిస్థితే మరోసారి సంభవించినట్లయితే ఏంచేయాలో తనకు తెలుసు. అందుకు గాను ఒక జీవితాన్నే మట్టిపాలు చేయవలసిన అవసరం ఎంత మాత్రమూ లేదు!

నలభై సంవత్సరాల జీవితాన్ని తనెలా గడప గలిగాడో తలుచుకుంటే గుండె చెరువవుతోంది. ఇన్నాళ్లు తన బతుకులో తనకు కనిపించని అనేక సత్యాలు, యీ కొద్ది గంటల్లోనూ తను తెలుసుకో గలుగుతున్నాడు. నిస్సారమైన బతుకులో నుంచి సారాన్ని పొంద గలుగుతూండటం అంటే ఏమిటో ఇప్పుడే తెలుస్తోంది. ఏదైతే సత్యమని తాను నమ్మి ఆరాధిస్తూ వొస్తున్నాడో, అదంతా అసత్యమని, సత్యమనే దాన్ని కేవలం అనుభవ పూర్వకంగా తెలుసుకున్నప్పుడు కానీ అర్థమవటం లేదనీ, తను గ్రహించాడు ... మరి తను గుడ్డిగా ఎంత అగాధం లోకి పడ్డాడో, ఇప్పుడు పైకి వొచ్చిం తర్వాత కాని తెలియటం లేదు! యీ లోతు తెలిశాక, యీ భయంకర ప్రమాదానికి మరోసారి గురికాకుండా

జాగ్రత్త పడాల్సిన అవసరం తెలిసి వొచ్చింది; ఒకరకం భయం ఏర్పడి, అదే తనకు రక్షణను ఇవ్వ గలిగేదిగా తోచింది.

వేశ్యలు అల్పులే కావొచ్చు. కాని యీ అల్పుల వల్ల ఎందరో ఘరానా మనుషుల బతుకులు ఉద్ధరించ బడుతూన్నవి! సమాజం వారిని వేరు పురుగులుగా పేర్కొన్నప్పటికీ, వారి అవసరం సమాజానికి చాలా వుంది: సమాజ శాంతికి వారెంతో ఉపయోగ పడుతున్నారు కూడాను. దీనికి తన యీ అనుభవమే ప్రబల తార్కాణం. స్వర్గమని పేర్కొన బడే లోక వాసులు కూడా, వేశ్యల ఆవశ్యకతల్ని గుర్తించారు; అసలు వేశ్యల్లోనే ఆ దేవత్వం వున్నదేమో?

బుర్ర విపరీతంగా పని చేయటం వల్ల అలసట కలిగింది. క్రమంగా మగతగా వుండి, నిద్రవొచ్చి పడుతోంది. ఉండి వుండి పడక కుదర నందువల్ల తూలి పడ్డాడు... వెంటనే మెలకువ వొచ్చింది. ఆలోచనలకు అంతరాయం కలగటం చేతవాతావరణానికి అలవాటు కాలేక పొయ్యాడు.

మంచం మీద పడుకుంది; పద్మేనేమో అని పొరపడటంలో ఆశ్చ ర్యం లేదు... వెంటనే తన తప్పును తెలుసు కున్నాడు. తనకు కుమార్తె లుగా ఉండదగిన వాళ్ళ మీదికి తన మనసు పోవటం ఎలా జరిగింది! ఎలా జరిగి నప్పటికీ, ఇక ముందు అలాంటి పొరపాటు జరగకుండా, తనను తాను కాపాడుకో గల మనో ధైర్యాన్ని మాత్రం పొంద గలిగాడు.

మంచం మీద హాయిగా పడుకుందా మనుకున్నాడు. కాని మన స్కరించ లేదు; రెండు తలగడాలు తీసుకొని పడక కుర్చీలో పడుకొని, మరో చిన్న బల్లను కాళ్ళకింద పెట్టుకున్నాడు; అంత సుఖంగా లేనప్ప టికీ, నిద్ర సుఖ మెరగదు కనుక, వెంటనే నిద్రకు లొంగిపొయ్యాడు.

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలకు కానీ సూర్యానికి మెలుకువ రాలేదు. రాత్రి ఎంతసేపు మేలుకొని వున్నప్పటికీ, ఉదయం ఏడిం టికే నిద్ర లేవడం అతని కలవాటు: తనంతట తానుగా లేవలేక పోయి నప్పటికీ, కిటికీలో నుంచి పడే సూర్యుని కిరణాల తాకిడికైనా లేచే

వాడు; కాని ఇవాళ తొమ్మిదింటి దాకా లేవక పోవడానికి కారణం; సూర్య కిరణాల బాధ లేకుండా సత్యవతి కిటికీ తలుపులు వేసింది. తను సుఖంగా ఉండేందుకు చేయగల పనులన్నీ చేస్తూండి పోయిందామె.

నిద్రనుంచి లేవగానే, సత్యవతి పత్రిక చదువు కుంటూ కనిపించింది. తను కదలగానే ఆమె చిరు నవ్వుతో విష్ చేసింది...నిద్రలో మరిచిపో గలిగిన సంగతులు, నిద్రకు ముందుగా తెగిన తలంపుల కొన వెంటనే స్మృతి పథంలో మెదిలింది. ఒకానొక దివ్యానుభవాన్ని పొందినాక, దాన్ని గూర్చి ఆలోచిస్తూనే తను నిద్ర పొయ్యాడు. నిద్రలో అది బాగా జీర్ణమై ఉండాలి కూడాను. ఇప్పుడు ఆ అనుభవమూ, దాని తాలూకు పరిణామాలను పొందిన సూర్యం: ఒక కొత్త శక్తితో కష్టపడి సంపాయించ గలిగిన కొత్త జ్ఞానంతో గర్వంతో నిద్ర నుండి లేవగలిగాడు. నిన్నటి ప్రపంచం వేరు; నేటి ప్రపంచం వేరు. నిన్న ప్రపంచానికి తను భయపడీ, ఆత్మహత్య చేసుకునే వరకూ దిగజారి పొయ్యాడు. యీ నాటి ప్రపంచాన్ని తను జయించ గలడు; కనీసం ధైర్యంగా నన్నా ఎదుర్కొ గలడు. తనకా కొత్త శక్తిని ప్రసాదించిన దేవత పొద్దున్నే ప్రత్యక్షమైంది! కనుక ఆ సంగతి మరిచిపో నక్కర్లేదు.

నిద్రలో పొందిన విశ్రాంతితో మనసూ, శరీరమూ కూడా చాలా తేలిగ్గానూ, కూలాసా గానూ ఉన్నవి. పెద్ద బరువును వొదిలించుకున్నాక, కాని ఎంత బరువునుంచి తాను విముక్తి సంపాయించ గలిగిందీ బాగా తెలిసి రాదు; అది తెలియగానే కలిగే ఆనందంతో,మనుస్సు నిండిపోయింది.

'ఇప్పుడే—వొస్తాను—' అని సూర్యం ఇంట్లోకి వెళ్ళి పోయాడు.. కాలకృత్యాలు తీర్చుకొని అరగంట తరువాత వొచ్చాడు. ఆ తరువాత టిఫిన్, కాఫీ వొచ్చినవి; ఇద్దరూ ఆరగించారు.

'నా కోసం వేచి ఉండక పోతే, టిఫిన్ తీసుకోక పొయ్యావా?' అన్నాడు సూర్యం.

'తొందరేముంది? మీతో పాటే తీసుకుందామని వూరుకున్నాను'

గృహిణికన్న ఎక్కువగానే, ఆమె తనను సంతోష పెట్టాలని ప్రయత్నం చేస్తోంది. తను ఆమెను సుఖపెట్టినా, కష్టపెట్టినా ఆమె పట్టించు కోదు; కేవలం తన మనస్తత్వాన్ని అనుసరించే నడవ గలదు. బహుశా యీ అపస్థ తాత్కాలికమే కనుక ఆమెకు అంత కష్టం

కాదేమో? త్వరలోనే విడుదలయే ఖైదీకి, జైలు ఆట్టే బాధాకరంగా ఉండక పోవడం సహజమే కదా!...కాని ఇదే ఆమె తన ఇల్లాలైనట్లయితే—ఆమె ధోరణే వేరుగా ఉండి వుండేది.

ఇల్లాలు! నవ్వుకున్నాడు తనలో తాను, తన మూర్ఖత్వానికి! నిజంగానే ఇల్లాలిని తెచ్చుకున్నట్లయితే, ఆమె జీవిత సర్వస్వమూ తన కొరకు త్యాగం చేయవలసి వుండేది. అలా ఆమె చేయలేక పోతే, ఆ దాంపత్యం ఎంతో ఘోరంగా పరిణమించక తప్పదు. ఒకవేళ ఆమె త్యాగం చేయగలిగితే, ఆ త్యాగానికి వేరొక రూపంలో తను వెలను చెల్లించవలసే వుండేది. ఆ వెల తన శక్తికి మించింది కనుక ఐతే, పరాజితుని వలె, పిరికి వానివలె, తనలో తాను కుమిలి పోవాల్సి వొచ్చేది...కాని యీమె విషయం వేరు. యీమె వెల తనకు అందుబాటులో ఉండడమే కాదు; తన దృష్టిలో చాలా స్వల్పం కూడాను. అంతకు మించిన త్యాగాన్ని ఆమె ఆశించదు.. ఒక వేళ తన పొరపాటుకు ఇది జరిమానా ఐనప్పటికీ, ఇలాటి పొరపాటును గూర్చి తను జీవితమంతా బాధ పడనక్కర్లేదు; ఎందుకంటే ఆ పొరపాటును తెలుసుకొనేందుకు, తిరిగి తాను సక్రమ మార్గంలో నడువ గలిగేందుకు అధిక శ్రమ, అధిక వ్యగ్ర ప్రయాసలు అక్కర్లేదు. ఒక విధంగా ఇది తనను ఇదే పొరపాటుకు తిరిగి ప్రోత్సహించినప్పటికీ పెద్ద ప్రమాదం జరిగేందుకు ఏమాత్రమూ వీలు లేదు...

చాలా స్వల్ప విలువకే యీమె తనదైంది కనుక, యీమె మీద తన అభిప్రాయం కూడా చాలా తేలికగే ఐంది! యీమెను కోల్పోయినప్పటికీ తను విరహ వేదనతో కుంగిపోనక్కర్లేదు. ఎందుకంటే ఆమె జీవిత సర్వస్వమూ తన పాదాల ముందు ఉంచేందుకు సిద్ధంగా లేదు; ఒక వేళ ఆమె అందుకు అంగీకరించినా, స్వీకరించేందుకు తాను మాత్రం ముందుకు రాడు. ఆమె వృత్తి ధర్మాన్ని ఆమె నిర్వర్తించినట్లే, తను తన అవసరాన్ని గడుపుకున్నాడు. ఇంతకు మినహా ఆమెతో మరోరకం బంధమేమీ లేదు. ఇంత స్పష్టంగా తెలిసిన విషయంలో తను కాలుజారటం కానీ, దిద్దుకోలేని పొరపాటుకు గురవటం కానీ జరగదు!

—అంటే యీమె లేక పోయినా, తను ఒంటరిగా గడపగల డన్నమాట! ఒక వేళ ఇది సాధ్యం కాకపోయినప్పటికీ, పెద్ద ఇబ్బందేమీ

లేదు; ఎప్పుడైతే యీ ఒంటరిపాటు తను భరించ లేడో, అప్పుడే యీ మెను పిలిపించుకో వచ్చు... ఒక వేళ యీ మె లభ్యమవక పోతే, ఈ మెలాటి వారే ఇంకోరు—ఇంతకన్న మంచి వాళ్ళే కావొచ్చు! ఎవరైతే నేమి—తనను సంతోష పెట్టగల వాళ్ళయితే చాలు!

ఐనప్పటికీ ఇవాళ, ఇప్పటినుంచే ఒంటరిగా తను గడప దలుచుకో లేదు. గత సాయింత్రం యీ మె తోడి పొత్తు చాలా అత్యవసర మని పించింది; దాని స్థానాన్ని 'విలాసం' ఆక్రమించింది. నిజంగా ఉపయోగం లేని అనేక వస్తువుల్ని కేవలం వినోదార్థం, విలాసార్థం పొందుతూన్నట్టే. యీ మెనుకూడా సరి కొంతసేపు పొందాలనే నిశ్చయం కలిగింది. తేలిగ్గా తీరే కోర్కెల్ని గూర్చి అతను మథన పడలేదు.

'ఐతే రేపు వెళ్దువు కాని—' అన్నాడు.

'సరే—' అని ఆమె కొంచెం అనుమానించి 'ఇంటికి డ్రైవర్ని పంపి—' అని ఆగిపోయింది.

'రేపొస్తావని కబురు చెయ్యనా?' అన్నాడు.

'ఊహూ. గుడ్డలు తెప్పించు కోవాలి'

యీ స్వల్ప వాంఛను ఆమె చెప్ప కుండానే తను గ్రహించ నందుకు, సూర్యం నొచ్చు కున్నాడు. నిజంగా దాంపత్య జీవితమే ప్రారంభ మైనట్లయితే, ఇలాటి అనేక స్వల్ప వాంఛలను తను గ్రహించి ఉండే వాడు కాడు. అప్పుడు ఆ భార్య తనను ఒక అసురుని గానే గాక, అరసికునిగా కూడా లెక్కకట్టి వుండేది... లేదా తనను బాధ పెట్టే విధానంలో తన కోర్కెల్ని బైట పెడుతూ, తనను చెప్పి పొడుస్తూ, తను పడే బాధలాటి దాన్నే వేరొక రూపంలో తనపట్ల కూడా ప్రసారితం చేసి కొంత మనో తృప్తిని పొందేది... జీవితాంతం తనా యమ యాతనల్ని భరించ వలసి వొచ్చేది... తనకు గడిచిన గండం విలువ, క్షణక్షణానికీ అధిక మూతున్న కొద్దీ తన దృష్టిలో తన అదృష్టం విలువ కూడా అధికంగా పెరగ సాగింది.

'సరే తెప్పిస్తాను—' అని సూర్యం బైటికి వెళ్ళాడు... కాని వెంటనే తిరిగి వొచ్చి సత్యవతిని వెంట పెట్టుకొని వెళ్ళి బట్టలున్న బీరువా తెరిచాడు...

కింది అరలో ఉన్న కొత్త బట్టలన్నీ చూపుతూ 'నీకు నచ్చినవి తీసుకో...' అన్నాడు. ఆమె అనుమానించింది.

'ఫర్వాలేదు...ఇవి కూడా ఖరీదైనవేలే' అన్నాడు నవ్వుతూ.

'ఊరకనే వొచ్చినవి కదానని చెయ్యి విలువైన వాటి మీదనే పడొచ్చు. అందుకని మీరే ఇవ్వండి.' అందామె.

'నాకు నచ్చింది నీకు నచ్చవొద్దా?'

'నేను ధరించే గుడ్డలు మీకు సైతం బాగుండాలనే!'

ఎంత ప్రయత్నించినా సూర్యానికి మరి జవాబు దొరకలేదు: కనుక తప్పనిసరై తనే కొన్నిట్ని ఏరి ఆమెకు ఇచ్చాడు. అవి తీసుకొని ఆమె 'ఇప్పుడే వొస్తాను' అని బాత్ రూమ్‌కు దారి తీసింది.

ఆ తరువాతి పావుగంటా వార్తా పత్రిక చదవటంలో గడిపాడు. నిజానికి పత్రికా పఠనంలో నిమగ్నుడయాక, ఆమె సంగతే మరిచి పోయ్యాడు; తమాషా—మరిచిపో గలిగాడు. తీరా ఆమె కొత్త బట్టల్లో ఎదుట వొచ్చి నిలబడితే ఆశ్చర్యంతో ఆమెను చూశాడు.

యీ ఆశ్చర్యం ఆమె కన్నులు మిరుమిట్లు గొల్పే అంద చందాలతో విరాజిల్లుతూందని కాదు; యీమె అందానికీ, విలాసానికీ తన కళ్లు బాగా అలవడి పోయినవి. ఆ బట్టలు—తన కుమార్తెవి కావటం వల్ల ఒక్క క్షణం పద్మే వొచ్చిందేమో ననే తలపు కలిగింది...రాత్రి కూడా ఒక క్షణం ఇలాగే తను పొరపడ్డాడు. కాని తమాయించు కున్నాడు...నిజమే తన ఒంటరి పాటును భరించ లేకుంటే తనకు భార్యకావాలని లేదు; తనకు కుమార్తెవలె ప్రవర్తించేది ఐతేమాత్రమేం?

యీ సత్యవతి కొత్త బట్టల్లో గదికే — కాదు; యీ ఇంటికే ఒక కొత్త శోభను కొని తెచ్చి నట్లుంది. ఆ శోభతో పాటే తనకూ ఒక కొత్త సందేహాన్ని అందివ్వ గలిగింది. నిర్భయంగా.

విచిత్ర మేమంటే—సత్యవతి మీద కామావేశం పూర్తిగా చల్లారింది; దాని స్థానే ఆమె కూడా కుటుంబంలోని రక్త బంధువే నన్నంత మమకారం పాతుకు పోయింది.

పన్నెండున్నర దాకా ఇద్దరూ చదరంగం ఆడారు; ఆమె ఆడ పోగాక, పద్మకన్నా బాగానూ, తనకన్నా తెలివిగానూ ఆడగల సమర్థురాలని తెలుసుకో గలిగాడు.

ఆ తరువాత భోజనాలయాయి. భోజనానంతరం కాస్త కునుకు తీసే అలవాటు ఉండటం వల్ల సూర్యం పడక వేశాడు; ఆ అలవాటు లేని సత్యవతి చదువుకుంటూ కూర్చుంది. అభిరుచులూ, అవసరాలూ, విరుద్ధమైన వైనా ఒకరికొకరు భారంగా తయారవలేదు. సూర్యానికి యీ మధ్యాహ్నం కూడా గాఢనిద్రే పట్టింది. గత రాత్రి అలసటవల్ల నిద్రపోయ్యాడు; ఇప్పుడు ప్రశాంతమైన మనసు, హాయిగా నిద్రించింది...

అతని మొట్టమొదటి వూహ సత్యవతిని గూర్చి! ఆమె తనకు ఎదురుగా వుంటుందనుకున్నాడు; చివరకు ఆమె ఆ గదిలో కూడా లేదు...ఒక వేళ ఒంటరిపాటును భరించ లేక ఇంటికి వెళ్ళిపోయిందేమో ననుకున్నాడు. యీ వూహతో తను తలక్రిందులయే మెట్టు ఎప్పుడో దాటాడు. ఆమె వెళ్ళిపోయినా, వున్నా ఒక్కటే!

తీరా కిటికీలో నుంచి చూస్తే ఆమె తోటలో తిరుగుతూ పూలమొక్కల్ని పరీక్షిస్తోంది. కాఫీతాగి, వేడినీళ్ళ స్నానం చేశాడు. బడలిక అంతా మాయమై చాలా హాయిగా వుంది. ఆ సమయానికే సత్యవతి తోటలో నుంచి తిరిగి వొచ్చింది. 'నిద్రలేచి చాలా సేపైందా?' అందామె.

'ఊహుఁ. ఇంతకు ముందే. అటూ తోటలోకి వెళ్దామా?'

'మీరు పదండి. నేను ఇప్పుడే కలుసుకుంటాను.' అందామె.

పిల్లగాలుల కదలికల్ని అనుభవిస్తూ, సూర్యం తేలిగ్గా అడుగులు వేసుకుంటూ తోటలోకి వెళ్ళాడు. బవర్‌ను చూసేప్పటికి, ఇది వరకటి భయమంతా పోయి, బవర్ లో కూర్చున్నాడు.

నిన్న సాయంత్రపు సంఘటన తాలూకు ఫలితాలు ఇంకా తెలియలేదు. ఆ ఫలితాల వల్ల తలక్రిందులయే దేమీ లేదు.

విశాలంగా ఆలోచిస్తే తను సత్యవతి పట్ల అపచారం కాకపోయినా, ఆమెను బాధించే విధంగానే ప్రవర్తించాడు. జరిగిన దాన్ని జరగకుండా చేయటం అసంభవం; కాబట్టి యీసారి సత్యవతి కనుక కనిపిస్తే క్షమార్పణ వేడటం తన కనీస బాధ్యత. ఆమె మీద తనకీ క్షణంలో ఎంతో జాలి కలిగింది. యీ ఇరవై మూడు గంటల్లోనూ తన వయస్సు షుమారుగా ఒక రోజే పెరిగినా, తన హృదయం మాత్రం సంవత్సరాల అనుభవం తాలూకు సారాంశాన్ని పొందింది.

సత్యవతి వొస్తోందేమోనని చూశాడు. ఆమె వొస్తోంది, ఆమె కేళ్ళ కాదు—తన స్వప్నసుందరి! దేవతై వొచ్చి, దెయ్యమై వెళ్ళి

పోయిన సత్యవతి ! నడకలో వయ్యారంతో పాటు, విలాసాన్ని కూడా వెదజల్లుతూ వొస్తోంది. ఆమె దగ్గరవుతూన్న కొద్దీ, ఎంతో ఉత్సాహంతో, తపసికి వరాల్ని ప్రసాదించేందుకు వొచ్చే ఇలవేల్పు వలె కనిపించింది. ముఖకళ ప్రశాంతంగానూ, ప్రసన్నంగానూ వుంది.

తమ మధ్య ఏమీ జరగనట్లే, ఆమెను ఆహ్వానించి కుర్చీని చూపాడు. ఆమె కూడా ఏమీ జరగనట్లుగానే కొంత సిగ్గును నటిస్తూనే కూర్చుంది.

'రాత్రి నీకు నిద్దర పట్టలే దనుకుంటూను?' అన్నాడు సూర్యం.

ఒక్క క్షణం సత్యవతి దిమ్మెర పోయింది. వెంటనే తమాయించుకొని 'ఔను. నిద్దర పట్టలేదు. చాలా దూరం ఆలోచించాను—' అన్నది.

'మంచిదే. ఆలోచించటం చాలా అవసరం కూడాను. ఏమాలోచించావు? ఏం తేల్చుకున్నావు?' అన్నాడు సూర్యం.

'ఏం లేదు...మీకు ఇల్లాలుగా ఉండేందుకే నిశ్చయించుకున్నాను'. అందామె;

యీ మాటలు అనగానే సూర్యం తన పాణిని స్వీకరిస్తా డనీ, ఎగిరి గంతేసి తనను భూమిమీద నిలవనీడనీ, ఆనందంతో నాట్యమాడే వరకూ వెళ్తాడనీ అనుకుంది పిచ్చి పిల్ల!

కాని ఆమె ఆశలు నిరాశలే నని ఎలుగెత్తి చాటే పెద్ద నవ్వు వినిపించగానే ఆమె దిమ్మెర పోయింది. తన చెవులును నమ్మలేక పోయింది. సూర్యంవైపు కళ్లు త్రిప్పిచూస్తే నిజాన్ని విప్పి చెప్పినయ్.

'సత్యవతీ!' అన్నాడు సూర్యం. ఎలాగో నవ్వును బలవంతాన ఆపు కుంటూ. నేరస్థుడు, తీర్పు చెప్పబోయ్యే న్యాయాధికారి వైపు ఆత్రుతతో చూసే దృష్టితోనే సూర్యంవైపు చూసిందామె.

'రాత్రి నేనూ బాగా ఆలోచించాను. నీ ఆలోచనలు ఎంతైనప్పటికీ, నా ఆలోచనల్లో ఒక భాగమే ఐవుంటవని ఖచ్చితంగా చెప్పగలను. ఆలోచనల సారాంశంగా నేనూ ఒక నిశ్చయానికి వొచ్చాను–'

ఆ నిశ్చయం ఏమై వుంటుందో తెలివిగల సత్యవతి ఊహించక పోలేదు. ఐనప్పటికీ కీడును శంకించే మనసుకు కూడా 'మేలు' చూచాయగా తగులుతూనే వుంటుంది కనుక ఆత్రుతతో 'చెప్పండి—' అందామె.

'నేను నిన్ను పెళ్ళాడ దలచలేదు. నిన్నే కాదు—ఏ ఆడదాన్నీ పెళ్ళాడను—' అన్నాడు సూర్యం.

గత సాయంత్రం సూర్యం పొందిన అవమానం లాంటి దాన్నే తనకు వర్తింప చేస్తున్నాడేమో ననే అనుమానంతో సత్యవతి అంది; 'నిన్న నేను పొరపాటు చేశాను...'

'కాదు, కాదు' అన్నాడు సూర్యం. 'నిన్న పొరపడింది నీవు కాదు, నేను. నిన్న సాయంత్రం నీవే కనుక పొరపడి వుంటే, మనిద్దరి జీవితాలూ మట్టిపాలయేవి...పోతే ఇవాళ పొరపడింది మాత్రం నీవే కాని, నేను కాదని రూఢిగా చెప్పగలను.'

'మీకు కోపం వచ్చింది. నిన్న జరిగిన దానికి ముందుగానే క్షమార్పణ చెప్పుకోవాలనుకున్నాను' అందామె.

'సత్యవతీ!' అన్నాడు సూర్యం ఎంతో మృదువుగా 'ఆ క్షమార్పణ వేడవలసిన వాణ్ణి నేను; నిన్న చేసిన తప్పుకు మాత్రమే ఆ క్షమార్పణ. ఇవాళ నేను తప్పు చేయలేదు కనుక, క్షమార్పణ అనవసరం...బురద తొక్కటం కాలు కడుక్కోటం కన్నా, అసలా బురద జోలికే పోకుండా ఉండటం మంచిది కదా!'

'ఒక్క రోజులో మీ రింత మారిపోతా రనుకో లేదు'

'నీవే కాదు; నేనూ అనుకో లేదు. నిన్నటి రోజులాంటి రోజు మళ్ళీ జీవితంలో రాకూడ దనుకుంటున్నాను; కాదు; రాకుండా చేయగల మనో ధైర్యాన్ని పొందగలిగి నందుకు గర్విస్తున్నాను' అన్నాడు.

సత్యవతికి అంతా అగమ్య గోచరంగా వుంది. తనకు బాగా తెలుసు ననుకున్న సూర్యం ఒక అపరిచితుడల్లే తయారయ్యాడు.

'నిన్నటి గొడవతో పాటు యీ నాటి గొడవను కూడా ఇద్దరమూ మరచి పొయ్యేందుకే ప్రయత్నిద్దాం—' అన్నాడు సూర్యం.

'—కాని నేను మనస్ఫూర్తిగా చెపుతున్నాను. నేను మిమ్మల్ని పెళ్ళాడేందుకు సిద్ధంగా వున్నాను—' అందామె.

'నేనూ మనస్ఫూర్తిగానే చెపుతున్నాను. నిన్ను అవమానించవలసిన పని లేదు...యీ విషయం మీద చర్చ అనవసరం. ఒకవేళ చర్చ సాగినా నీ కది అర్థం కాదు. కనుక విను; నీవు మామూలుగానే వొస్తూండు. మనిద్దరమూ పొరపడ్డ వాళ్ళమే. ఒక దానికి మరోటి చెల్లు...అందుకని—'

సూర్యం—మాట పూర్తి చేయకముందే సత్యవతి కళ్ళు చెమ్మగిలినయ్. ఆమె పరాభవాగ్నితో పాటు యీర్ష్యతో కూడా వూగిపోతోంది. అతాతుగా లేచి నిలబడి ఆమె అంది, 'నాకు తెలిసింది. నేను అర్థం చేసుకోలేనంత అమాయకురాల్ని కాదు. ఎవతెనో తెచ్చుకున్నారు. అందుచేతనే మీ రీనాడు యీ విధంగా మాట్లాడగలుగుతున్నారు.'

సూర్యం చలించ లేదు, చిరు నవ్వుతో అన్నాడు. 'ఓ! ఆ దేవత నీకు కూడా దర్శన మిచ్చిందా? ఐతే నా జన్మతో పాటు నీ జన్మ కూడా తరించిం దన్నమాట!'

'దేవతా? ఎవరూ?' అందామె.

'వేశ్య!' అన్నాడు సూర్యం; ఈ మాట అన్నప్పుడు అతను సిగ్గు పడలేదు. తను నిజాన్ని తెలుసుకోవటమే కాదు, నిజాన్ని ధైర్యంగా చెప్పగల శక్తిని కూడా పొందాడు.

'వేశ్య!...డబ్బుకోసం శరీరాన్ని అమ్ముకునే నీతి జాతి లేని స్త్రీ...' అంది సత్యవతి. ఆ పైన మాట్లాడకుండా సూర్యం అడ్డుపడ్డాడు.

'ఔను, ఆమె నీచురాలే కావొచ్చు. మరి నీచమైన కార్యాలు చేసేందుకు కూడా కొంతమంది కావాలి కదా! ఉదాహరణకు నీవు నీచ కార్యాలు చేయగలవా? చెప్పు?'

'నేనా? మీరు నన్ను పరాభవించా లనుకుంటున్నారు' అన్నదామె హీనంగా. 'మీకు సంస్కారం వుందనుకున్నాను—'

'పూర్వం నేనూ సంస్కారం వుందనే పొరపడ్డాను. కాని యీ వేశ్య నన్ను సంస్కరించింది—'

'ఔను...డబ్బుకు మానాన్ని అమ్ముకునేది...' ఉద్వేగంతో ఇంకా తిట్టవలసిన తిట్లకోసం సత్యవతి వెతుక్కుంటోంది. ఆమెకు ఆ శ్రమను తప్పించేందుకు సూర్యం అందుకున్నాడు.

'ఆమె ధనానికి బానిసే! కనుకనే నాబోటి వాడికి లభ్యమైంది ...నీవు ఆమెకన్న యీ విషయంలో ఏ మంత అధికురాలివి?'

'మీకు మతి పోయింది—' అందామె నిస్పృహతో.

'నిన్న సాయంత్రం కూడా నాకు మతిపోయిం దన్నావు. నిజంగా నీకే మతి పోయిందేమో ననుకున్నాను. కాని నాకే పోయింది; ఆ

పోయిన మతిని మళ్ళీ పొంద గలిగాను. అందుకోసే ఇప్పుడు నీకు మతి పోయిందని నేను స్పష్టంగా గ్రహించ గలుగు తున్నాను—'

సత్యవతి మాట్లాడ బోయింది. కాని సూర్యం ఆమెను మాట్లాడ నివ్వలేదు. ఎలాగైనా ఆమెకు నచ్చ చెప్పాలనే ప్రయత్నాన్ని అత నింకా వొదల లేదు...

'ఆమె డబ్బుకే ఆశించి వొచ్చింది. నీవు కూడా ఆ డబ్బుకు కాకుంటే నా దగ్గర్నుంచి మరేం ఆశించ గలవు? ఐతే ఆమె తన రూపాన్ని, తన ఆశయాన్ని యధాతధంగా కనబరించింది. నీవో? నీవు కోరేది కూడా ఐశ్వర్యమే కానీ, అందులో కొంత బెట్టు చూపి, దాని విలువను పెంచావు. ఆమె తాత్కాలికంగా భార్యాత్వాన్ని వహించే నీచత్వానికే పాల్పడిం దనుకో... కాని నీవు జీవితాంతం వరకూ యీ భార్యాత్వం లోని నీచత్వాన్ని ధరించేందుకు సిద్ధమయ్యావు. ఆమె నీచు రాలైతే, నీవు ఏ మౌతావో నేను చెప్పక్కర్లేదు—'

'చివరకు నన్ను ఆమెతో పోలుస్తున్నారన్న మాట?' అంటా మె, కందగడ్డవలె ఎర్రనైన మొహంతో.

'నీకు కోపం వచ్చినా నేను భయపడక్కర్లే దనుకుంటాను. నేను చెప్పే నిజం నీకు ఇప్పుడు అర్థంకాదు... ఐనా చెపుతాను. నిన్నూ ఆమెనూ పోల్చి చూశాకనే నాకు యీ సమస్య తేలికైంది. ఆమె కొద్ది ధనాన్ని నా నుంచి ఆశించింది; కాని నీవు నా సర్వస్వాన్నీ ఆశించావు. అది నేరమని కాదు కాని, నేనా విలువను చెల్లించ లేను...

ఆ తరువాత మాట్లాడేందుకు వీల్లేకుండా సత్యవతి రానే వొచ్చింది.

'సత్యవతీ!' అన్నాడు సూర్యం.

ఇద్దరూ ఒక్కసారే 'ఆఁ.' అన్నారు.

సత్యవతు లిద్దరూ ఒకర్నొకరు చూసుకున్నారు. వేశ్యకు ప్రణయం ఎంతదూరమో, యీర్ష్య కూడా అంతేదూరం కనుక ఆమె చలించ లేదు. కాని కుమారి సత్యవతి కళ్లు నిప్పులు కక్కుతూన్నవి; పేరులో కూడా తనకు అడ్డుపడ్డ ఈ స్త్రీని చూస్తుంటే ఆమెకు వొళ్లు మండిపోతోంది. యీ ఇద్దరి స్త్రీల లోని భేదాన్ని సూర్యం గమనించాడు.

'నిన్ను కాదు—' అని వేశ్యతో అని 'చీకటి పడుతూన్నట్లుంది' అన్నాడు సూర్యం. ఆ సత్యవతి వినిపించుకునే స్థితిలో లేదు. ఆమె

తీవ్రాలోచనలకు [illegible]ం కలిగించ కూడదనే నిశ్చయంతో వేశ్య చేతిని పట్టుకుని నడిపించుకుంటూ బంగళా వైపు సాగాడు సూర్యం.

వాళ్ళిద్దర్నీ తను గాయపరచానేమోనని వేశ్య బాధ పడింది. కాని సూర్యానికి తెలుసు—యీ వేశ్య తామిద్దర్నీ రక్షించిందని.

మరో కొత్త ఆలోచన సూర్యానికి తళుక్కున మెరిసింది. తను యీ వేశ్యను ఇక్కడే ఉంచేశాడు. ఆమె తనను అపాయం నుంచి కాపాడింది; నిజానికి ఆమె అవసరం తనకిప్పుడు లేదు. తన లాటి వాళ్ళను అనేక మందిని అనేక అపాయాలనుంచి యీమె ఇదివరకే కాపాడి ఉండొచ్చు; ఇకముందు కూడా కాపాడగలదు...ఐతే యీమె ఇక్కడ వుంటే ఇది కుదరదు. తనలాటి నిర్భాగ్యుడే జీవితంలో దెబ్బతిని, దాన్ని తట్టుకునేందుకు యీమె సహాయం కోసం యీమె వాకిటిముందర పడిగాపులు కాస్తూ ఉండి ఉండొచ్చు.

ఇదంతా యీమెకు చెప్పాలనుకున్నాడు. కాని! చెప్పటం వల్ల జరిగేదేమిటి? యీమె తన గొప్పతనాన్ని గ్రహించేస్తుంది. అది ఆమె గ్రహించటమంటే తన తక్కువ తనాన్ని మరొక విధంగా రుజూ చేసుకోవటమేనన్నమాట! అప్పుడామె తనకు దూరమవుతుంది. చాలామంది గొప్పవాళ్ళు, తమ గొప్పతనాన్ని గ్రహించలేకనే, సామాన్యులకు చేదోడు వాదోడుగా ఉండగలుగుతున్నారేమో?

సూర్యం వేశ్యను ఇంట్లోకి తీసుకువెళ్ళి ఒక నోట్ల కట్టను ఇచ్చాడు. అది ఎంత వుంటుందో సూర్యానికి తెలియదు; వెయ్యికి తక్కువ ఉండదని మాత్రం చెప్పవొచ్చు. ఆమెకు ఇదేమీ అర్థం కాలేదు.

'తీసుకో...ఇంటికి వెళ్లు—' అన్నాడు సూర్యం తొందరను సూచించే కంఠ స్వరంతో. 'మీ కేదో ఇబ్బంది కలిగించాను. ఏమైనా తప్పు చేసివుంటే...' అని మొదలెట్టిందామె.

'ఎబ్బే! ఏమీ లేదు. నిజంగా ఏమీ లేదు' అన్నాడు సూర్యం మాటల్ని నొక్కుతూ. ఆమె నమ్మలేదు; ఐనా ఇబ్బంది కూడా లేదు.

'మళ్ళీ...?' అందామె.

'మళ్ళీ...త్వరలోనే కావొచ్చు—కలుద్దాంగా—' అని ఆమెను తొందర తొందరగా పోర్టికోలోకి తీసుకొచ్చాడు.

డ్రైవర్‌కు సైగ చేయటంతోనే కారు కదిలింది. సత్యవతి నమస్కరించింది. యీ సారి సూర్యం వెంటనే నమస్కరించాడు; ఆమె నమస్కరించిన దానికి ఇది ప్రతి నమస్కారం కాదు. ఆమె నమస్కరించక పోయినా, తన లాటి అల్పుణ్ని అధికుడ్ని చేసినందుకు అతను తప్పక నమస్కరించి ఉండేవాడు. కారు బయలుదేరి వెళ్ళింది. సత్యవతి ఇంకా బవర్‌లో నుంచే తీక్షణంగా చూస్తూవుంది.

'పిచ్చి పిల్ల' అనుకున్నాడు సూర్యం 'తన సౌఖ్యాన్ని పాడు చేసిందనే భ్రమతో వేశ్యను తిట్టుకుంటూ వుంటుంది...కాని యీ సేవిక నన్నే కాదు; తనను కూడా ఒక గొప్ప ప్రమాదంనుంచి కాపాడగలిగింది. అందు కామె ఏ రూపానా ప్రతి ఫలాన్ని కోరలేదు. ఆ సంగతి ఆమెకు ఎంత తెలియదో, యీమెకూ అంతే తెలియదు - ఎప్పటికీ తెలుసుకో లేరు! తనకో విరోధి అని పొరబడే వ్యక్తి చేసిన మేలును తెలుసుకో లేనంత కృతఘ్నురాలు! యీ ఇద్దరి మధ్యా నలిగిన నా కొక్కడికే తెలుసీ సంగతి!'

సత్యవతి నిరాశతో మెల్లిగా వెళ్ళి పోతోంది. సూర్యం ఆమెతో పాటే అస్తమించే సూర్యుణ్ని చూస్తూ వర్షించిన మేఘం వలె తేలికైన మనస్సుతో, గట్టిగా ఊపిరి వొదిలి శాశ్వతంగా శాంతి దేవత మాత్రమే తాండవమాడే ఇంటి లోకి దారితీశాడు.

— ఐపోయింది —